# ప్రేమ్‌చంద్

జీవితం - సాహితి

రచన

దాశరథి రంగాచార్య

ప్రచురణ



రిజిష్టర్డ్ నెం. 1/64

యువభారతి
సాహితీ సాంస్కృతిక సంస్థ
5 కింగ్స్‌వే, సికిందరాబాదు-3

PREMCHAND JEEVITHAM - SAHITI

A brief biodata and apprisal of literary works of famous writer PREMCHAND.



యువభారతి

ప్రచురణ : 73

ప్రథమ ముద్రణ : 20 ఫిబ్రవరి 1981

ప్రతులు : 1,200

ముఖ పత్ర రచన :
శీలా వీర్రాజు

ముద్రణ :
పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్
హైదర్‌గూడ, హైదరాబాదు

ముఖ చిత్ర ముద్రణ :
రామా ప్రింటర్స్
గాంధీభవన్, హైదరాబాదు

ప్రతులకు :
యువభారతి
5 కింగ్స్‌వే, సికింద్రాబాద్ - 500 003
లేదా
యువభారతి కార్యాలయం
ఆంధ్ర సారస్వత పరిషత్ భవనములు
తిలక్ రోడ్, హైదరాబాదు - 500 001

వెల: రూ. 5/-



# యువభారతి పరిచయం

మనిషిలో అంతర్లీనంగా, నిక్షిప్తంగా ఉన్న ప్రతిభా పరిమళాలు పరివ్యాప్తం కాగలిగినప్పుడే అతని సృజనాత్మక శక్తికి సార్థక్యం చేకూరుతుంది. సమాజంలో సౌందర్యం, సౌజన్యం పెంపొందటానికి అనువైన వాతావరణం ఏర్పడుతుంది. పరస్పరావగాహనం జరుగుతుంది. నిర్మాణాత్మక దృక్పథాలకు ప్రాచుర్యం లభిస్తుంది. సమైక్య భావాలు కుదురుకుంటాయి.

యువభారతి కడచిన పదిహేడేళ్ళుగా సమాజంలో సామరస్యాన్ని పెంపొందించేందుకు సాహిత్యంకంటె ఇతరమైన సాత్త్విక సాధనం లేదనే విశ్వాసంతో ఇతోధిక కార్యక్రమాలను రూపొందించి కృషి చేస్తున్నది. సాధ్యమైనంత తక్కువ వెలకు వీలైనంత ఎక్కువ మందికి ఉత్తమ సాహిత్యాన్ని అందజేస్తే సాహిత్యం పట్ల ప్రజానీకానికి అనురక్తి పెరుగుతుందనే నమ్మకంతో ప్రచురణ కార్యక్రమాన్ని చేపట్టింది. ఇంతవరకూ 78 ప్రచురణలను ప్రచురించి మూడు లక్షల ప్రతులకు పైగా సాధ్యమైనంత తక్కువ వెలకు తెలుగు పాఠకులకు అందించ పూనుకొన్నది.

భారతదేశంలో ఎక్కడున్నాసరే యువభారతి నిర్వహిస్తున్న సాహిత్యోద్యమంలో పాలుపంచుకోగలిగేందుకు ప్రారంభింపబడిన సాహితీమిత్ర పథకంలో 6800 మంది సహృదయులు చేరి ప్రణాళికను విజయవంతం చేశారు. యువభారతి భవిష్య నిర్మాణంలో సహకరించేందుకు ఆరంభింపబడిన సభ్యత్వ పథకాలలో భారత మిత్రులుగా 725 మంది, భారత భూషణులుగా 70 మంది చేరారు.

ఉదాత్తభక్తితో మేము చేస్తున్న భాషా సేవకు అండదండలుగా నిలిచారు ప్రజలు. వారి సౌహార్దం, భాషాప్రియత్వం ఇవే మా పెట్టుబడి. మా తపస్సు ఫలించి తెలుగు దేశంలో అధ్యయనశీలతా, సౌజన్యం పెంపొందాలని ఆకాంక్షిస్తున్నాం.

సహృదయుల సహకారాన్ని అర్థిస్తూ

హైదరాబాదు
1981

ఇరివెంటి కృష్ణమూర్తి
అధ్యక్షుడు : యువభారతి

# మా మాట



భారతీయ సాహిత్యంలో 'ఆదాన్ ప్రదాన్' కా[illegible]టాు అతివేలంగా జరుగకముందే తెలుగు ప్రజలకు బాగా [illegible] హిందీ రచయితలు నలుగురే— మీరాబాయి, కబీరు, తులసీదాసు, [illegible]. ఈ నలుగురిలో మొదటి ముగ్గురి రచనలు భారతీయుల భక్తి సంప్రదాయ వాహికలుగా తెలుగు ప్రజల గుండెల్లోనూ ప్రవహించినవి. గాంధీ మహాత్ముని నిర్మాణాత్మక కార్యక్రమాల్లో ఒకటైన హిందీ ప్రచారాన్ని దక్షిణ భారత హిందీ ప్రచారసభ దక్షిణ ప్రాంతాల్లో సాగించింది. తెలుగు దేశంలోను ముమ్మరంగా నిర్వహించింది. 1920 నాటికే హిందీ కథా,నవలా సాహిత్యం కొత్త పుంతలను తొక్కి, దేశాభిమానాన్ని, గ్రామీణ జీవితరీతులనూ ప్రవేశపెట్టిన ప్రేమ్‌చంద్ రచనలు దక్షిణాదివారికి ఈ సభ వారి ద్వారా అందినవి. తెలంగాణంలో 1948 దాకా ఉర్దూ బోధనా భాషగా ఉండడంచేత ప్రేమ్‌చంద్ సుపరిచితుడైనాడు. ఇప్పటికీ ఇదే స్థితి. ఏ హిందీ రచయితా ఇంతగా తెలుగువాళ్ళకు తెలియదు. ఆయన రచనల అనువాదాలు, ఆయన రచనలపై వ్యాసాలు అనేకం వెలసినవి. అభూతకల్పనలనుంచి, ప్రణయలీలా విలాసాలనుంచి హిందీ కథా నవలా ప్రక్రియలను తప్పించి, వాస్తవిక ధోరణినీ, సంస్కారాత్మక ప్రయోజనాన్ని, గ్రామీణ జీవితంలో నిక్షిప్తమైన భారతీయతనూ తన రచనల ద్వారా పరిచయంచేసి కృతార్థుడై ఆదర్శప్రాయుడైనాడు ప్రేమ్‌చంద్.

ఆయన శతజయంత్యుత్సవ సందర్భంగా 'యువభారతి' ఆయనసాహిత్య వ్యక్తిత్వాలను పరిచయం చేసే ఒక పుస్తకాన్ని ప్రచురించాలని సమకట్టింది. మా ఆశయానికి అనుగుణంగా ఈ పుస్తకాన్ని వ్రాసి ఇచ్చిన శ్రీ దాశరధి రంగాచార్యులవారు ప్రసిద్ధ నవలా రచయితలు. ఆంధ్రప్రదేశ్ అకాడెమీ బహుమతి గ్రహీతలు. ఉర్దూ, హిందీ, ఇంగ్లీషు, సంస్కృతం, ఆంధ్ర భాషల్లో చక్కని అభినివేశం సంపాదించిన పండితులు. రామాయణాన్ని అందమైన తెలుగు వచనంలో అందించిన ఆర్ద్రమనస్కులు. అభ్యుదయ రచయితల ఉద్యమాన్ని నిర్వహిస్తున్న ప్రముఖులు. మా యువ భారతికి ఆత్మీయులు. ప్రేమ్‌చంద్‌ను గూర్చి ఈ పుస్తకాన్ని మాకు వ్రాసి ఇచ్చి మాతో సహకరించి, మేము నిర్వహిస్తున్న సాహిత్యోద్యమానికి ప్రోత్సహిస్తున్న శ్రీ దాశరథి రంగాచార్యులకు మా హార్దిక ధన్యవాదాలు. ప్రేమ్‌చంద్‌ను పరిచయం చేస్తూ 'నివాళి' రచించిన ఆత్మీయులు డా॥ భీమసేన్ 'నిర్మల్'గారికి అభినందనాలు.

ఇరివెంటి కృష్ణమూర్తి.

# కిరణం

సమాజానికి సాహిత్యానికి అవినాభావ సంబంధం వుంది. సమాజానికి దూరంగా సాహిత్యానికి మనుగడలేదు. నీటికి దూరంగా చేప జీవించలేదు. నీటికి దూరంగా మనగలిగింది చేప బొమ్మ మాత్రమే. దానికి ప్రాణంలేదు. అయినా అది చేపలా కనిపిస్తుంది. వాస్తవంగా చేప కాదు. అలాగే సమాజానికి దూరంగా, సమాజానికి అతీతంగా కొంత సాహిత్యం తయారు కావచ్చు. అది సాహిత్యం వంటిదేగాని సాహిత్యం కాదు. అది చేప బొమ్మలాంటిది. చేప మాత్రం కాదు.

సమాజాన్ని ఒక వ్యక్తిగా భావించుకుంటే, సాహిత్యం దానికి నేత్ర ప్రాయం. ఆయా కాలాల సమాజాలను మనం సాహిత్యనేత్రం ద్వారానే పరిశీలించగలం. సాహిత్యాన్ని పరిశీలించేవారి శక్తి సామర్థ్యాలను బట్టి సమాజపు బాహిర స్వరూపాన్నే కాక సమాజపు ఆత్మను, దాని మనసును కూడా పరిశీలించడం సాధ్యం అవుతుంది. అయితే పరిశీలకుని దృష్టి నిశితం కావాలి- విలక్షణం కావాలి-నిష్పక్షపాతంగా వుండాలి.

సమాజం వ్యక్తుల సముదాయం మాత్రం కాదు. సమాజం అనేక శక్తుల సమాహారం. ఈ శక్తులు ఎప్పుడూ ఒక రకంగా వుండవు. కాలాన్నిబట్టి మారుతుంటాయి. ప్రకృతి సర్వదా పరిణామానికి లోనవుతుంది. అలాగే సమాజానికి నిరంతర పరిణామం వుంది. ఈ పరిణామాన్ని గమనించడం అవసరం. ఈ పరిణామాన్ని తన మనోనేత్రం ద్వారా పరిశీలించగలిగిన శక్తిగలవాడు ప్రేమ్ చంద్.

ప్రకృతికి ఒక తత్వం వుంది. వ్యక్తికి ఒక తత్వం వుంది. అలాగే సమాజానికి ఒక తత్వం వుంది. తత్వం దేనికయినా మూలం. తత్వాన్ని తెలుసుకోక సమాజాన్ని గుర్తించాం అనడం ప్రాణాన్ని వదిలి దేహాన్ని పట్టుకోవడం లాంటిది. అయితే ఈ తత్వాన్ని అన్వేషించిన రచయితలు బహుకొద్దిమంది. అలాంటి బహుకొద్ది మంది ఆధునిక రచయితలకు ఆద్యుడు ప్రేమ్‌చంద్.

ప్రేమ్‌చంద్ మౌలికంగా గొప్ప మానవుడు. మానవత అతని మతం. ప్రతి రచయితా ముందు మానవుడు కావాలి. ఆ తరువాతనే రచయిత కాగలడు. స్పందించే మానవ హృదయం లేనివాడు రాయగలడు. రచయిత కాలేడు. మానవతామూర్తి అయిన ప్రేమ్‌చంద్ నిజమయిన రచయిత-ఉత్తమ రచయిత- మహారచయిత. అందుకే ప్రేమ్‌చంద్ జన్మించి నూరేళ్లు గడచినా 'ప్రేమ్‌చంద్ వంటి'' రచయిత కూడా ఇంతవరకు జన్మించలేదు.

ప్రేమ్‌చంద్ నాటి సమాజం పల్లెలు. అది వ్యవసాయిక సమాజం. భూస్వామ్య సమాజపు సర్వలక్షణాలూ అందులో కనిపిస్తాయి. నాటి పల్లెల జీవనాన్ని కోట్ల మంది చూచారు. ప్రేమ్‌చంద్ చూశారు. ప్రేమ్‌చంద్‌లో ఉన్న మానవుడు చూచాడు. అతని గుండె చెరువయింది. అలా అనేక మంది

గుండెలు చెరువులు అయ్యేంటాయి. తాను చూచిన వాటికి కళారూపం ఇవ్వగల శక్తి ప్రేమ్‌చంద్‌కు మాత్రమే ఉంది. అతను తన కళా తపస్సుతో గీసిన బొమ్మలు, ఇంత కాలం గడిచినా, జరామరణాలు లేక, మన సమాజాన్ని వెక్కిరిస్తున్నాయి. అయితే మనం వెక్కిరింతలకేకాదు, వేటికీ చలించని వాళ్ళంగా తయారయినాం.

భారతీయ సమాజపు వాస్తవ జీవితాన్ని ప్రేమ్‌చంద్ వలె చిత్రించినవారు లేరంటే అతిశయోక్తి మాత్రం కాదు. అలాంటి ప్రేమ్‌చంద్ తన జీవిత కాలంలో దుర్భర దారిద్ర్యాన్ని అనుభవించాల్సి వచ్చిందంటే మన సమాజం ఎవరిని గౌరవిస్తుందో, ఎవరిని పూజిస్తుందో మనమంతా ఆలోచించాలి. ఎందుకంటే, ఆలోచించడంకంటే మనం ఏమీ చేయలేం కాబట్టి!

ప్రేమ్‌చంద్ తన జీవితాన్ని కర్పూరంగా వెలగించి మనకు వెలుగును ప్రసాదించాడు. ప్రేమ్‌చంద్ గతించాడు. ఆతను వెలిగించిన దివ్వెలు ఏనాటికీ ఆరవు. ఏ తుఫానులూ వాటిని ఆర్పలేవు. అవి నిశ్చలంగా వెలుగుతూనే ఉంటాయి. వెలుగును ప్రసాదిస్తూనే ఉంటాయి.

మానవతా మూర్తి, మహా రచయిత ప్రేమ్‌చంద్ జన్మించి వంద ఏళ్ళయింది. మనం వారి జన్మశతాబ్ది జరుపుకుంటున్నాం - అదీ అంతంత మాత్రంగానే. ఆడంబరాలు లేని వారిని గుర్తించకపోవడం మన ప్రభుత్వాల లక్షణం. అందుకే ప్రేమ్‌చంద్ శతాబ్ది ఉత్సవాలను ప్రభుత్వం అంతగా పట్టించుకోలేదు. లాంఛనప్రాయంగా జరిపాము అనిపించుకుంది.

ప్రేమ్‌చంద్ గొప్పదనాన్ని ఎరిగిన కొన్ని సాహితీ సంస్థలు మాత్రం కొన్ని కార్యక్రమాలు నిర్వహించాయి. తెలుగు దేశంలో సాహిత్య వ్యాప్తికి నిరంతరం కృషిచేస్తున్న సంస్థ ''యువభారతి''. ఆ సంస్థ ప్రేమ్‌చంద్‌ను గురించి ఒక పుస్తకం ప్రచురించ తలపెట్టింది. ఆ సంస్థ అధ్యక్షులు, సహృదయులు ఇరివెంటి కృష్ణమూర్తిగారు పుస్తకం రచించే భాగ్యం నాకు కలిగించారు. ప్రేమ్‌చంద్ మహా సముద్రం. అతన్ని అర్థం చేసుకోవడానికి నా సాయశక్తులా ప్రయత్నించాను. ''యువభారతి'' వారు కోరినట్లు ఈ చిన్న పుస్తకం రచించి ఇచ్చాను. దీన్ని ప్రచురించినందుకు ''యువభారతి''కి కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను.

పుస్తకం మీముందు ఉన్నది. అది ప్రేమచంద్రుని వెన్నెలలోని ఒక కిరణం మీకు అందించగలిగినా నేను కృతార్థుణ్ణి అయినట్లుగా భావిస్తాను.

మారేడు పల్లి
సికింద్రాబాదు.
28-12-80.

మీ
దాశరథి రంగాచార్య.

# నివాళి

'వ్రాసిందంతా సాహిత్యంకాదు. చక్కటిభాషలో సత్యాన్ని వ్యక్తీకరిస్తూ, మనస్సుమీద, మేధస్సుమీద ప్రభావాన్ని కలిగించేదే సాహిత్యం. అలా వాస్తవికత, సహజత్వం ఉట్టిపడే రచనలే శతాబ్దాలపాటు మానవ హృదయాలిని కదల్చివేయగలవు' అని అభ్యుదయ రచయితలను (1936 లో) ఉద్బోధించిన మహా రచయిత ప్రేంచందు. కేవలం మనోరంజనానికి పరిమితమయినదీ, జోలపాడి నిద్రపుచ్చేదీ, కన్నీళ్ళు వరదలుగా కురిపించేదికాదు సాహిత్యం. 'ఉన్నత భావాలతో, మౌలికమైన ఆలోచనలతో, ఆత్మవికాసం కలిగించి, మానవుణ్ణి ఆదర్శోన్ముఖుణ్ణి చేసేదే సాహిత్యం. అది యాధార్థ్యమే దేయూతగా ధరించి, మానవాళికి మార్గదర్శకత్వం వహించాలి' అన్నదే ప్రేంచందు లక్ష్యం. ఆ లక్ష్యానికి అనుకూలంగా, అప్పటిదాకా కాల్పనిక జగత్తులో విహరిస్తున్న హిందీ కథా (Fiction) వాఙ్మయానికి, సామాజిక స్పృహ కలిగించినవాడు ప్రేంచందు. జీవితంలో ఉదాత్తమయిన ఆదర్శం లేకపోవటంకంటే, మానవుడి ఉనికియే లేకపోవడం మేలుకదా అని అంటాడాయన.

'చెడును సహించలేనివాడే దాని నిర్మూలనకి నడుం బిగిస్తా'డని అన్న ప్రేంచందు అలనాటి సాంఘిక జీవితములో గల చెడును ఎత్తిచూపించి, చెడును ద్వేషించి, మానవుణ్ణి ప్రేమించి, తన రచనల్లో తన అనుభూతులకు ఆదర్శాత్మకంగా రూపకల్పన చేసినాడు. వ్యవసాయం వృత్తిగాలేని రైతుకుటుంబములో జన్మించి, గుమస్తాగిరియే జీవనోపాదిగా గల పరివారంలో పెరిగి, పరిస్థితుల ప్రాబల్యంవల్ల ఉపాధ్యాయుడయిన ప్రేంచందు గాంధీ సిద్ధాంతాలచే ప్రభావితుడయి, పుంఖానుపుంఖాలుగా రచనలు చేశాడు. ఆయన నవలేకాదు, కథలుకూడా విశ్వసాహిత్యంలో మణిదీపాల్లాంటివి. ఆయనను నవలాచక్రవర్తి అన్నా, కథానికాచక్రవర్తి అన్నా ఆ బిరుదు సార్థకమే అవుతుంది. ఎందుకంటే, ఆ రెండు రంగాలలో ప్రేంచందు ఏకఛత్రాధిపత్యాన్ని సాధించాడు. అటువంటి రచనాచక్రవర్తి ఆయన తర్వాత మరొకడు పుట్టలేదంటే అతిశయోక్తి కాదు.

మీది ఏ పార్టీ? అని అడిగితే నాది పేదలపార్టీ అని అన్న ఆ మహానుభావుడు తన జీవితమంతా పేదలకే సమర్పితం చేశాడు. సంఘంలో అట్టడుగున పడివున్న రైతు-కూలీల జీవితాలను కళ్ళకు కట్టినట్లుగా చిత్రించి, పాఠకులలో ఉత్తేజం కల్పించి, సాంఘిక వ్యవస్థలో మార్పుతేవాలని అహర్నిశలూ కృషిచేసిన 'సాహిత్య శ్రామికుడు' (కలం కా మజ్దూర్) ప్రేంచందు. సంఘంలోని నిమ్న

వర్గాలకు చెందినవారి జీవితాలను, వారి సమస్యలను ప్రేంచందు శక్తిమంతంగా, సహజంగా, అవితరసాధ్యంగా చిత్రించాడు.

తాను నమ్మినసత్యాన్ని జీవితంలో ఆచరించి చూపించిన మహోన్నతుడు ప్రేంచందు. ద్వితీయవివాహం మొదలుకొని, ఉద్యోగానికి రాజీనామా చేయడంవరకూ, సినిమారంగంలో పరాజయంపొందడం దగ్గరనుండి, గోర్కీ సంతాప సభకు వెళ్ళడం వరకూ అన్నీ ఆయన హృదయపూర్వకంగా నమ్మి ఆచరించి చూపించిన సత్యాలే. అందుచేతనే ఆయన రచనలు సూటిగా హృదయాలను హత్తుకుంటాయి. ఆయన రచించిన 18 నవలలలో దాదాపు 400 కథలలో అన్నిపాత్రలు, సన్నివేశాలు అభూతకల్పనలు కాక, మనం రోజూ చూస్తున్నవే అని అనిపిస్తాయి. ఆయన ఒక చోట 'కల్పనకంటే సత్యమే (యాథార్థ్యమే) సుందరంగా ఉంటుందని అంటాడు. నిజమే, అందుకనే ప్రేంచందు రచనలు సహజసుందరాలు. ఆయన చనిపోయి దాదాపు 45 సం॥లు అయినా ఆయన రచనలు నిత్యనూతనాలే, నిత్యసత్యాలే.

'సామాన్యప్రజలపట్ల సానుభూతికల రచయితలు సహజమయిన సరళ శైలిలోనే వ్రాస్తారు.' అని ఒకచోట 'అన్నాడు ప్రేంచందు. హిందూస్తాన్ ఉత్తర భారతదేశంలో సామాన్యమయిన వ్యావహారిక భాష. అందులో సంస్కృత శబాదంబరం ఉండదు. అటువంటి చక్కటి వ్యావహారిక భాషలో ప్రేంచందు వ్రాసినంత గొప్పగా మరే హిందీ రచయిత వాయలేదు. అందుచేతనే ఆయన హిందీవారికి, ఉర్దూవారికి సమానంగా ఆదరపాత్రుడయినాడు.

ప్రేంచందు జన్మశతాబ్ది సందర్భంగా, తెలుగువారికి ఆ మహారచయిత జీవితం-సాహిత్యంతో పరిచయం కల్పించడానికి 'యువభారతి' వారు పుస్తకం వెలువరించడం ఎంతో ముదావహం. అందుకు వారు ఎంపిక చేసిన రచయిత ఈ కార్యభారాన్ని నిర్వహించడానికి సర్వధా సమర్థుడు. హిందీ-ఉర్దూ భాషల్లో చక్కని ప్రవేశం కలిగి, స్వయంగా తెలంగాణా జమీందారీ వ్యవస్థకు దర్పణాలు అయిన నవలలు రచించిన శ్రీమాన్ దాశరథి రంగాచార్యులుగారు ప్రేంచందు జీవిత విశేషాల్లను వివరిస్తూనే ఆయన వ్యక్తిత్వంలో గల మహోన్నత తత్త్వాలకూ, ఆదర్శాలకూ నివాళి పట్టారు. ముఖ్యమైన మూడు నవలలేకాకుండా, ఇతర నవలలను, కథలను చక్కగా పరిచయం చేశారు. మన తెలుగువాళ్లు చేసుకొన్న పుణ్యంఏమో కాని, ప్రేమ్‌చందు రచనలన్నీ తెలుగులో లభిస్తున్నాయి. అవి చదివి ఆనందించడం తెలుగువారి కర్తవ్యం.

ఈ పుస్తకం పాఠకులలో ప్రేంచందు రచనలు చదువుదామనే ఆసక్తి ప్రజలందరికీ కలిగించగలదని ఆశిస్తున్నాను.

*12-8-81* —భీమసేన్ నిర్మల్.

# ప్రేమ్ చంద్

గత శతాబ్దంలో భారతదేశం ఆంగ్లేయుల బానిసత్వంలో మగ్గింది. అన్నిరంగాల్లోనూ ఆంగ్లేయుల నిరంకుశత్వానికి, దోపిడికి గురి అయింది అయితే ఈ బానిసత్వంనుంచి భారతభూమిని విముక్తం చేయాలనే స్వాతంత్ర్య సమరజ్వాల కూడా ఆ కాలంలోనే ఉజ్వలంగా వెలిగింది.

భారత స్వాతంత్ర్య పిపాస అనేకమంది మహా మహులు రూపుదిద్దుకోవడానికి ఉపకరించింది. విచిత్రం ఏమంటే, కటిక చీకట్లోంచి అనేకమంది భాస్కరులు తమ వెలుగులను విరజిమ్ముతూ అవతరించారు. గత శతాబ్దపు ఉత్తరార్ధంలో జన్మించినంతమంది మహా మహులు భారత చరిత్రలో జన్మించి ఉండరు.

గత శతాబ్దపు ఉత్తరార్ధం భారతదేశానికి ఒక రకంగా ఉజ్వలయుగం అని చెప్పవచ్చును. ఈ కాలంలో అన్ని రంగాల్లోనూ అనేకమంది యుగ పురుషులు జన్మించారు. వారు ఉజ్వల పురుషులు. వారి కాంతిపుంజాలు యావత్ప్రపంచంలో వ్యాపించి భారతదేశపు కీర్తికాంతులను ఇనుమడింప చేశాయి. అలాంటివారిలో బాల గంగాధర తిలక్, రాజా రామమోహన్‌రాయ్, రామకృష్ణ పరమహంస, వివేకానందుడు, మహాత్మా గాంధి, నెహ్రూ, సర్దార్ పటేల్, రాజేంద్రప్రసాద్, ప్రకాశం పంతులు వంటివా రున్నారు. విజ్ఞాన రంగంలో జగదీశ్ చంద్రబోస్, ఇంజనీరింగ్‌లో సర్ విశేశ్వరయ్య వంటి వారు ఆ యుగంలో అవతరించిన మహా మహులు.

సాహిత్యరంగంలో కూడా కొందరు యుగ భాస్కరులు అవతరించారు. వారు అంతరించినా వారు సృష్టించిన సాహిత్యకాంతులు అజరామరంగా ఇంకా స్వచ్ఛంగా ప్రసరిస్తూనే ఉన్నాయి-ఉంటాయి. వారిలో రవీంద్రుడు, బంకించంద్, ఇక్బాల్, సుబ్రహ్మణ్య భారతి, గురజాడ అప్పారావు, కందుకూరి వీరేశలింగం పంతులు, ఉన్నవ లక్ష్మీనారాయణ మున్నగువారు. వీరంతా తమ రచనల ద్వారా జాతిని ప్రభావితం చేసి జాతిని జాగృతం చేసిన వైతాళికులు.

ఆ కాలంలోనే జన్మించిన మహా రచయిత మున్షీప్రేమ్‌చంద్. ప్రేమ్‌చంద్ కీర్తికోసం రచనలు సాగించలేదు. అతడు క్రాంతిపతాకం చేతబూని రచనలు సాగించాడు. ప్రేమ్‌చంద్ రచనను ఒక ఉద్యమంగా నిర్వహించిన యోధుడు అతడు భారత జాతిని, జాతి జీవనాన్ని నగ్నంగా, అగ్నంగా చిత్రించిన మహా శిల్పి. అతడు దాపరికాలు ఎరుగడు. దాష్టీకం తెలియనివాడు. నిగర్వి. అతడు సామాన్యుడు. సామాన్యుని జీవితాన్ని అసామాన్యంగా చిత్రించిన మహా రచయిత. అతని రచనల్లో భారతజాతికి జీవనాడులయిన పల్లెలు, పల్లె ప్రజల జీవితాలు ముసుగు తొలగించుకుని ప్రత్యక్షం అవుతాయి. అతని కలం బలం అయింది. దాంతో అతను సృష్టించిన పాత్రలలో ఉచ్ఛ్వాస నిశ్వాసాలు అనిపిస్తాయి. గుండె చప్పుళ్ళు వినిపిస్తాయి. అతని పాత్రలు అతి సామాన్యం అయినవి. అవి మట్టి వాసనలు విరజిముతుంటాయి. అతని కథలు అతి సామాన్యమయినవి కేదారాల వయ్యారాలు కనిపిస్తుంటాయి. ఆతని సంఘటనలు అతి సామాన్యం అయినవి. వాటిలో జలపాతాలు దర్శనం ఇస్తుంటాయి. ప్రేమ్‌చంద్ తనను తాను "కలంకా మజ్దూర్" అని చెప్పుకున్నాడు. అతన్ని "కలంకా సిపాహి" అన్నారు మరి కొందరు. అయితే సపాయి కూడా కూలివాడే కదా! శ్రమ జీవులకోసం జీవించి, శ్రమజీవుల జీవితాన్ని సుందరంగా చిత్రించిన శ్రమజీవి ప్రేమ్‌చంద్ భౌతికంగా అంతరించినా వారి యశఃకాయం వారి రచనల్లో ప్రకృతిని ఎదిరించి అజరామరంగా నిలిచిపోతుంది.

ప్రేమ్‌చంద్ "లహమి" గ్రామంలో జన్మించారు. "లహమి" కాశీనగరానికి నాలుగుమైళ్ళ దూరంలో ఉంది. వారు 1880 లో జన్మించారు. అందుకే భారతదేశం అంతటా ఈ సంవత్సరం ప్రేమ్‌చంద్ శత జయంతి జరుపుతున్నారు. ఆ ఉత్సవాల్లో భాగంగానే 'యువభారతి' వారు 'ప్రేమ్‌చంద్'ను గురించిన పుస్తకం ప్రచురించ తలపెట్టారు. రచనా బాధ్యతను నాకు అప్పగించారు ప్రేమ్‌చంద్ సాహిత్యం సముద్రంలాంటిది. ఆ సాగరాన్ని దొన్నెలో పట్టి మీకు అందించే ప్రయత్నం నాది. నా ప్రయత్నం ఎంతవరకు ఫలించిందో నిర్ణయించాల్సింది మీరు.

ప్రేమ్‌చంద్ అసలు పేరు "ధన్‌పత్‌రాయ్". అది తండ్రి పెట్టిన పేరు. వారి పెదనాన్న పెట్టిన పేరు "నవాబ్‌రాయ్". పేరు మార్చుకోవడానికి కారణం ఉంది. వారి కథలు ' సోజెవతన్" పేర సంకలనంగా ప్రచురించారు.

ఆ కథలు సమాజంలో సంచలనం కలిగించాయి. గవర్నమెంట్ అదిరిపోయింది. ఈ కథలు ఏదో విప్లవజ్వాలను రగిలిస్తున్నాయని గ్రహించింది. కలెక్టర్ ''ప్రేమ్‌చంద్''ను పిలిపించారు.

''నీవు ఇంగ్లీషువాళ్ళ రాజ్యంలో ఉన్నావు కాబట్టి సరిపోయింది. కాకపోతే నీ చేతులు ఇప్పటికి నరకేసి ఉండేవారు. కథలు రాసి దేశంలో అరాచకం సృష్టిస్తున్నావు, జాగ్రత్త'' అని కథల పుస్తకాలన్నింటినీ జప్తు చేశారు.

తన పుస్తకాలు తనముందే జప్తు అవుతుంటే గుండె ఎంత మండిపోయి ఉంటుందో ఊహించాలి. అప్పటినుంచీ 'ధన్‌పత్‌రాయ్' తన పేరు ప్రేమ్‌చంద్‌గా మార్చుకున్నారు. తొలి పేరు అగ్నికి ఆహుతి అయింది. ఆ మాటల్లోంచి ఉద్భవించిన పేరు ప్రేమ్‌చంద్. ప్రేమ్‌చంద్‌కు ప్రేమ విషయంలో ఎంత విశ్వాసం ఉందో వారు పెట్టుకున్న పేరునుబట్టి విదితం అవుతుంది.

''చెరుకు నుంచి రసం పిండేస్తే పిప్పి మిగుల్తుంది. మానవ హృదయంలో ప్రేమ లేకుంటే అది చర్మం తొడిగిన అస్థిపంజరం అవుతుంది. మానవుడు కాలేడు'' అంటారు ప్రేమ్‌చంద్ ''మానస సరోవర్''లో.

ప్రేమ విషయంలో అంత విశ్వాసం ఉన్న ప్రేమ్‌చంద్‌కు మాతృప్రేమ లభించలేదు. ''మాతృప్రేమ స్వప్నార్థం అయింది. ఆ ప్రేమ పొందలేని దురదృష్టవంతుణ్ణి'' అని చెప్పుకున్నారు. ప్రేమ్‌చంద్ ఎనిమిదో ఏటనే తల్లిని పోగొట్టుకున్నారు. ''అన్నయ్య నన్ను ఎంతో ప్రేమగా చూసేవాడు. కాని మాతృప్రేమలోని స్నిగ్ధత ఎలా వస్తుంది? అమ్మను తలచుకుని ఏడ్చేవాణ్ణి'' అంటారు.

''నాకు బాల్యం లేదు'' అంటాడు గోర్కీ. చిన్నతనంలోనే తల్లిని పోగొట్టుకున్న ప్రేమ్‌చంద్‌కూ బాల్యం లేదని చెప్పవచ్చు. తండ్రి మళ్ళీ పెళ్ళాడాడు. సవతితల్లి కింద పెరిగాడు. వారికి ముగ్గురు తోబుట్టువులు తండ్రి పేరు అజాయబ్‌రాయ్. తల్లి ఆనందీబాయి. వీరిది కాయస్థ జాతి. శ్రీవాస్తవ తెగవారు.

తల్లి లేదు. తండ్రి మళ్ళీ పెళ్ళాడాడు. ప్రేమ్‌చంద్‌కు కుటుంబంలో లభించాల్సిన ఆత్మీయత, వాత్సల్యం లభించలేదు కుటుంబంలో అతనికి సన్నిహితులులేరు. ఒంటరితనమే అతని జీవితం అయింది. ఇంట్లో ఉండేవాడుకాడు. బయట పొగాకు కొట్టువాళ్ళతోను, టపాజవానుతోనూ స్నేహం పెంచుకున్నాడు.

టపా జవాన్ను తండ్రి ఉద్యోగం నుంచి తీసేశారు. తనవాడు తనకు దూరం అయినట్లు ఎక్కెక్కి ఏడ్చాడు. తండ్రి దగ్గర సాన్నిహిత్యం లేదు. అడిగే ధైర్యంలేకున్నా అడిగాడు.''వెధవను తీసేశాను. నీకేంపనివానితోని, చదువుకో'' అని కసిరాడు తండ్రి.

వీధి నాటకాలంటే ప్రేమ్‌చంద్‌కు ఎంతో ఇష్టం. ఉత్తరదేశంలో వీధి నాటకాలను "రామ్‌లీల'' అంటారు. ఏ కథ అయినా రామ్‌లీలాయే. అది తులసీదాస్ రామాయణ ప్రభావం అయ్యుండాలి. 'రామ్‌చరిత్రమానస్'' ఉత్తర భారతీయుల జీవితాన్ని అంత ప్రభావితం చేసింది. రాముని పాత్ర ప్రేమ్‌చంద్‌కు అతి ఇష్టం అయింది. తన దగ్గర ఏ మంచి వస్తువు ఉన్నా పరిగెత్తి రాముని వేషం వేసినవారికి అందించేవాడు. రాముడు తనతో మాట్లాడితే ఉబ్బి తబ్బిబ్బు అయ్యేవాడు.

తల్లిలేని పిల్లవాడని ఎవరయినా సానుభూతి కనబరచినా సవతితల్లి ఓర్చలేకపోయేది. ఒకనాడు ప్రేమ్‌చంద్ తండ్రికి మిత్రుడు ప్రేమ్‌చంద్‌ను చూచి దగ్గరికి తీసుకున్నాడు. ''చిక్కిపోతున్నావు. నెయ్యా, పాలూ వాడాలి బాబూ'' అన్నాడు. ఆ రాత్రి పప్పులో గిన్నెడు నెయ్యి గుమ్మరించింది సవతి తల్లి. ''ఇహ ఇంటింటికెళ్ళి నా గురించి ప్రచారం చేయకు'' అన్నది. గాలి పటాలంటే ప్రేమ్‌చంద్‌కు ఎంతో ఇష్టం. కొనడానికి డబ్బులుండేవికావు. తెగిన పటాల వెంట పరిగెత్తేవాడు.

ప్రేమ్‌చంద్‌ది ఒంటరి జీవితం. ఆ ఒంటరితనంలోంచే ఆలోచనలు పుట్టాయి. ఆలోచనల్లోంచి రచనలు వచ్చాయి. ఒంటరితనపు ఆలోచనల్లో రాత్రిళ్ళు నిద్ర వచ్చేదికాదు. అప్పటికి వారికి పదమూడేళ్ళే. అయినా ఆలోచనలు అతన్ని ఎంతో పెద్దవాణ్ణి చేశాయి. ఆ వయసులోనే వారు రచనలు సాగించేవారు. రాయడం, చింపేయడం చేస్తుండేవారు. తండ్రి తాను రాయడం చూచినపుడు ''మహాశయా! రచనలు సాగిస్తున్నారా?'' అనేవాడు. తండ్రికి రచనలను గురించి తెలియదు. ప్రోత్సహించలేకు. అసలు అగ్గి అనేది ఉంటే అది అంటుకొని భగ్గుమంటుంది. అచ్చం ప్రోత్సాహంతోనే రచనలు రావు. ప్రేమ్‌చంద్‌లో అణగారిన అగ్గి ఉంది. అది ఆలోచనల గాలికి అంటుకుంది. భారతజాతికి వెలుగు చూపే కాంతివంతం అయిన రచనలు వచ్చాయి.

## పెళ్ళి-మళ్ళీ పెళ్ళి

అవి బాల్య వివాహాల రోజులు. పెళ్లికి వధూవరులు అంగీకరించాలనే అవగాహన సహితం లేనిరోజులు. సవతి తల్లితండ్రి ప్రేమ్‌చంద్‌కు సంబంధం కుదిరించాడు. ఆ సంబంధం తండ్రికి ఇష్టంలేదు. కాని ఇష్టంలేదనే స్వతంత్రం లేనివాడు తండ్రి. ఇంకా స్కూల్లో చదువుతుండగానే ప్రేమ్‌చంద్‌కు పెళ్ళి జరిగింది. ఎందుకో భార్య విషయంలో ప్రేమ్‌చంద్‌కు అనురాగం ఏర్పడ లేదు. అంతేకాదు ఏదో అయిష్టత. పైగా అత్తతో జగడాలు. అత్తాకోడళ్ళ మధ్య నలిగిపోసాగాడు ప్రేమ్‌చంద్. భార్యాభర్తలకు జగడాలు. సవతితల్లి అందులో ఆజ్యం పోసేది. ప్రేమ్‌చంద్ తన భార్యను పుట్టింటికి పంపిం చేశారు.

శివరాణికి కూడా చిన్నతనంలోనే పెళ్ళి అయింది. భర్త కూడా చనిపోయాడు వైధవ్యం ప్రాప్తించింది. ఆమె తండ్రి దేవీప్రసాద్‌కు అది తీరని బాధగా పరిణమించింది. శివరాణికి విధవా వివాహం చేయాలని సంక ల్పించారు. ఆ రోజుల్లో అదే గొప్ప. అది నిజమే కాని వరుడు లభించాలిగా. విధవా వివాహానికి సిద్ధపడే వరుడు లభించటం ఈరోజుల్లోనే దుస్తరం, ఆనాటి మాట చెప్ప పనిలేదు. వరుడు కావాలని పత్రికా ప్రకటన చేశారు.

''ఎంతో మంది యువకులు నన్ను పెళ్ళాడ్డానికి సిద్ధపడ్డారు. కాని మా నాన్నకు వారిలో ఒక్కడూ నచ్చలేదు. ఒకనాడు వారి దగ్గర్నించి ఉత్తరం వచ్చింది. అందులో వారి చదువూ, ఉద్యోగం గురించి రాశారు మా నాన్న వారిని ఫతేపూర్ రమ్మని రాశారు. వచ్చారు. వారు ఈ పెళ్ళి విషయం ఇంట్లో వాళ్ళకు కూడా చెప్పలేదు. సమాజాన్నీ, తన వాళ్ళను కూడా లక్ష్యం చేయకుండా నన్ను పెళ్ళాడారు. ఈ విషయంలో వారు ఎంతో ధైర్యం చేశారనే చెప్పాలి'' అన్నారు శివరాణీదేవి.

ఆదర్శాలు వల్లించడం వేరు, ఉపదేశించడం వేరు, ఆచరించి చూపిన వారు అరుదు. అలాంటి అరుదయినవారిలో ఒకరు ప్రేమ్‌చంద్. ఆతడు అతి నిరాడంబరి. ఎంత ఘనకార్యం చేసినా గొప్పగా చెప్పుకొనని కార్యశీలి ఈనాటి యువతరానికి సహితం ఆదర్శంగా నిలిచిన వారు ప్రేమ్‌చంద్. సమాజంలో చైతన్యం గలిగించడానికి రచనలు చేయడమేకాక, సాంఘిక దురాచారాలను ఎదిరించిన యోధుడు. ప్రేమ్‌చంద్ రచనల్లో ఎంత ఆదర్శం

ఉందో అతని జీవితంలో కూడా అంత ఆదర్శం ఉంది. ప్రేమ్‌చంద్ ఆదర్శ రచయిత. ఆదర్శ జీవి. రెంటినీ సమన్వయించిన వారు చాల తక్కువ. అలాంటివారిలో ఒకరు ప్రేమ్‌చంద్.

ప్రేమ్‌చంద్ దీపం లాంటివారు. దీపం పని వెలుగునివ్వడం. వెలుగు ఇచ్చానని దివ్వె గర్వపడదు. వెలుగువల్ల ఎంతో మందికి ప్రయోజనం కలుగుతుంది. దాన్ని గురించి కూడా దివ్వె పట్టించుకోదు. వెలుగు పొందినవాళ్ళే పట్టించుకోవాలి.

## చదువు - సంపాదన

తల్లి బాల్యంలోనే పోయింది. తండ్రి కూడా గతించారు. సంసార భారం ప్రేమ్‌చంద్ మీద పడింది. సవతి తల్లి తమ్ముడు విజయ బహదుర్ భారం కూడా వారి మీదనే పడింది. చునార్‌గఢ్ నెలకు అయిదు రూపాయిలకు ప్రైవేట్లు చెప్పారు. ప్రయాణానికి డబ్బులేక ఉన్న ఒక్క ఉన్ని కోటూ రెండు రూపాయలకు అమ్ముకోవలసి వచ్చింది. అలహాబాదులో పది రూపాయలు సంపాదించేవారు. వంట చేసుకుని తినడం, స్కూలుకు వెళ్ళడం చేసేవారు. అది ఒక క్లిష్ట దశ. కష్టాల బతుకు. ఆ కష్టాల్లోనే వారు ''కృష్ణ'' అనే నవల రాశారు. ఇండియన్ ప్రెస్సులో అచ్చు వేయించారు.

శివరాణితో పెళ్లి జరిగింతరవాత" డిప్యూటీ ఇన్‌స్పెక్టర్'' పదవివచ్చింది. కాన్పూరుకు పోస్టింగ్ వచ్చింది. ప్రేమ్‌చంద్ శ్రమజీవి. రచనలో ఆయనకు ఆనందం లభించేది. ''నేను కలం కూలిని. నా కలం నాకు పార,'' అనేవారు. ఉదయం కాస్త ఫలహారం చేసి రాయడం సాగించేవారు. టూర్లలో ఉన్నా, అనారోగ్యంగా ఉన్నా రాయడం మాత్రం మానేవారు కాదు. అధికారిగా కింది ఉద్యోగుల మీద ఎన్నడూ పెత్తనం చేయలేదు. టీచర్లను విసిగించడం, కష్ట పెట్టడం వారికి గిట్టేది కాదు. అందుకే కింది వారికి వారంటే భయం ఉండేది కాదు. భయం మీద వారికి నమ్మకంలేదు. పై అధికారులకు వారంటే ఇష్టం ఉండేది కాదు. పై వారి అడుగులకు మడుగులొత్తడం వారి స్వభావానికి విరుద్ధం.

ఒకరోజు ఉద్యోగం నుంచి తిరిగి వచ్చారు. సాయంకాలం అయింది. ఇంటిముందు పేపరు చదువుతూ కూర్చున్నారు. ఇన్‌స్పెక్టరు గుర్రం మీద

ఆ ఇంటిముందు నుంచే వెళ్ళాడు. అతన్ని చూడగానే ప్రేమ్‌చంద్ లేచి నుంచుని నమస్కరిస్తారని ఆశించాడు. ప్రేమ్‌చంద్ లేవలేదు, నమస్కరించ లేదు. ఆఫీసరుకు అవమానం అనిపించింది. కాస్తదూరం వెళ్లి నౌకరును పంపి ప్రేమ్‌చంద్‌ను పిలిపించాడు.

"నీవు చాల గర్విష్టిలా కనిపిస్తున్నావు. నీ ఆఫీసర్ వెళ్తుంటే లేచి నమస్కరించవా ?'' అడిగాడు.

''స్కూలు సమయంలోనే నేను మీకు నౌకరును. నా ఇంట్లో నేనూ మహారాజునే'' అన్నారు ప్రేమచంద్.

గోరఖ్‌పూర్‌లో ఉండగా ప్రేమ్‌చంద్‌కు ఒక ఆవు ఉండేది. ఒకనాడు ఆవు కలెక్టరు బంగాళాలో ప్రవేశించింది. కలెక్టరుకు కోపం వచ్చింది. ప్రేమ్ చంద్‌ను పిలిపించాడు. రాకుంటే ఆవును కాల్చేస్తానన్నాడు. ప్రేమ్‌చంద్ కలెక్టరు బంగాళాకు బయలుదేరాడు. దోవలో గుంపులు గుంపులుగా కలెక్టరు బంగాళా వైపు వెళ్తున్న విద్యార్థులు కనిపించారు.

''మీరంతా ఇక్కడెందుకు చేరారు ?'' ప్రేమ్‌చంద్ అడిగారు.

''కలెక్టరు బంగాళాలో మీ ఆవు దూరిందట దాన్ని దొరగారు కాల్చి వేస్తారట.''

''మరి ఆ విషయం నాకెందుకు చెప్పలేదు ?''

''మీదాకా ఎందుకు ? మేం చాలమా ?''

''అతడు కాల్చేశాడనుకోండి, మీరేం చేయగలరు?''

''కాల్చేస్తాడూ-మాటలా ? రక్తపు చేరులు పారాయి. తెలియదూ!'' అన్నారు పిల్లలు ఆవేశంతో.

పిల్లలను శాంతింపచేసి కలక్టరు దగ్గరికి వెళ్లిన ప్రేమ్‌చంద్ ''నన్ను ఎందుకు పిలిపించారు?'' అని అడిగారు.

''మీ ఆవు నా బంగళాలో ప్రవేశించింది మేం ఇంగ్లీషువాళ్ళం. తల్చుకుంటే అవును కాల్చేయగలం. తెలుసా ?''

''అవును, మీరు కాల్చేస్తారు. మరి నన్నెందుకు పిలిచినట్లు ?''

''నేను కలెక్టర్ను. ఏమయినా చేయగలను,''

''మీరు కలెక్టరని నాకు తెలుసు. మీరు ఇంగ్లీషు వాళ్ళనీ నాకు తెలుసు. అవును కాల్చగలరనీ నాకు తెలుసు. కాని మీరు తెలుసుకోవాల్సింది ఒకటి ఉంది. ప్రజాశక్తిముందు అవేవీ నిలవ్వు. అన్నీ కొట్టుకుపోతాయి.''

''ఈ సారికి వదిలేస్తున్నాను. అవును భద్రపరచుకోండి.''

''మీరు కాల్చదల్చుకుంటే అవును కాల్చండి. కాని నన్నుమాత్రం పిలిపించకండి'' అని ఆవేశంతో ప్రేమ్‌చంద్ గిర్రున తిరిగి వచ్చేశారు.

చలికాలంలో టూర్‌కు వెళ్ళాల్సి వచ్చేది. అప్పుడు ప్రేమ్‌చంద్ పాత శాలువా కప్పుకుని, వారు ఎక్కే గుర్రానికి కొత్త శాలువా కప్పేవారు. ప్రాణిజాలపు కష్టాన్ని చూచి సహించలేకపోయేవారు. సకల ప్రాణులనూ వారు దయగా చూచేవారు.

తనకింద పనిచేసేవాళ్ళను ఎంతో ప్రేమగా చూసేవారు. వయసు మళ్లిన వారంటే తండ్రినివలె గౌరవించేవారు. నౌకర్లకు పనులు చెప్పే వారు కారు. తమ బట్టలు తామే ఉతుక్కునేవారు. ఎవరి పనులు వాళ్ళే చేసుకోవడం మంచిది. ఇతరులమీద ఆధారపడడం మంచిది కాదు. మన పనులు మనం చేసుకోవడం కన్నా ఉత్తమం లేదు'' అన్నారు.

ఏ ఊళ్ళో ఉన్నా పాలు, పెరుగు కూరగాయలు ఉచితంగా అందించడం ఆచారంగా ఉండేది. ప్రేమ్‌చంద్ ఆ ఆచారాన్ని వ్యతిరేకించారు ఉచితంగా ఏదీ తీసుకోవడం ఇష్టం ఉండేది కాదు. అయితే గ్రామస్తులు ఈ నియమాన్ని పాటించకుంటే ముందు ముందు వచ్చేవాళ్ళకు ఇబ్బంది కలుగుతుందని చెప్పారు. అప్పుడు అందుకు అంగీకరించినా వచ్చిన పదార్థాలన్నింటినీ నౌకర్లకు ఇచ్చే వారు. ఇంట్లో ఆ పదార్థాలను వాడనిచ్చేవారు కారు.

ప్రేమ్‌చంద్ ఆరోగ్యం అంత మంచిది కాదు. చిన్నతనం నుంచే వారికి అజీర్ణవ్యాధి. ఎంతో బాధ పడుతుండేవారు. 1915 లో జీర్ణశక్తి మరీ క్షీణిం చింది. బదిలీకోసం దరఖాస్తు పెట్టుకున్నారు. నేపాలు కొండ ప్రాంతంలోని ఒక ఊరికి బదిలీ అయింది. అక్కడ ఆరోగ్యం మరీ క్షీణించింది. శలవు పెట్టారు. వచ్చే రూపాయల్లో గడపడం కష్టం అయ్యేది. విధిలేక డ్యూటీలో చేరాల్సి వచ్చింది. అక్కడి నీరు పడి రాలేదు. ఆరోగ్యం మరీ క్షీణించింది. బదిలీ కోసం దరఖాస్తు పెట్టుకున్నారు ''మహోబా నీరు పడదు ఈ ఊరు నీరూ పడదు. ఏం చేయమంటావు ? 40 రూపాయల టీచరు కొలువుంది

వెళ్తావా ?'' అని అడిగాడు డైరక్టరు. నెలకు నూరు రూపాయలు వచ్చే ఉద్యోగం వదులుకుని 40 రూపాయల జీతానికి టీచరుగా చేరారు. అలా ఉండగా మూడో కొడుకు పదకొండో నెలలో మశూచికంతో చనిపోయాడు. ''జనన మరణాలు సృష్టిసైజం. అయినా వాడివల్ల నీవేం సుఖం అనుభవించావు? పుట్టినప్పటినుంచీ జబ్బులే. నేను బతికే ఉన్నాను. నా కోసం అయినా దుఃఖాన్ని మరిచిపో'' అని శివరాణిని ఓదార్చారు.

## త్యాగం-దేశభక్తి

దేశంలో స్వాతంత్ర్య సమర జ్వాలలు అలముకున్నాయి. మహాత్ముడు సమరాంగణాన శంఖం పూరించాడు. ''అహింస'' అనే ఆయుధాన్ని చేతబూని సూర్యుడస్తమించని ఆంగ్ల సామ్రాజ్యాన్ని ఎదిరించడానికి ఉద్యమించాడు. మనిషి రక్తం చవిచూచిన ఆంగ్ల పాలకులు అహింసను తుపాకి గుళ్లతో ఎదిరించారు. జలియన్‌వాలా బాగ్‌లో మారణహోమం జరిపాడు రాక్షసుడు జనరల్ డయర్. జలియన్‌వాలా బాగ్‌లో మృత వీరులకు బాష్పాంజలి సమర్పించడానికి బ్రహ్మాండం అయిన సభ జరిగింది. మృతవీరులకు జోహారులు అర్పించడానికి పదివేల మంది సమావేశం అయ్యారు. జనరల్ డయర్ సైన్యాన్ని సభకు నూరు గజాల దూరంలో నుంచో పెట్టాడు. గుండ్లు అయిపోయేదాకా కాల్చమని ఆజ్ఞాపించాడు. ప్రశాంతంగా సభ జరుపుకుంటున్నవారి మీద అగ్గి వాన కురిపించాడు. 1650 తుపాకి గుండ్లు కాల్చారు. 379 మంది ప్రాణాలు అర్పించారు. 1200 మందికి గాయాలు తగిలాయి. డయర్ ఇవి ఏవీ పట్టించుకోలేదు మందు గుండు అయిపోగానే అక్కడనుంచి వెళ్లిపోయాడు.

జలియన్‌వాలాబాగ్ హింసాకాండ విని భారతదేశపు ఆత్మ ఆక్రోశించింది. దేశపు నలుమూలలా క్రోధానల జ్వాలలు వ్యాపించాయి. మన ప్రేమ్‌చంద్ దేశభక్తుడు. పరాయి పాలనను అంతమొందించాలని తపన అతని అణువణువు జ్వలింపింది. జలియన్‌వాలాబాగ్ అతన్ని కదిలించివేసింది. ఏం చేయాలి ? ఎలా ఉద్యమించాలి? ఇది భారత ప్రజలముందున్న సమస్య.

1920 లో గాంధీజీ సహాయనిరాకరణ ప్రకటించాడు. గాంధీజీ గోరఖ్‌పూర్ వచ్చాడు. సభకు ప్రేమ్‌చంద్ హాజరయినారు. భారత ప్రజల రక్తాన్ని పీలుస్తున్న ఆంగ్ల ప్రభుత్వానికి సహకరించరాదు. పరాయి ప్రభుత్వం కింద

ఉద్యోగాలు చేయరాదు వృత్తులు వదిలేయాలి అని హెచ్చరించాడు. ప్రేమ్‌చంద్‌లో రగులుతున్న జ్వాలకు ఒక మార్గం దొరికింది. కాని వృత్తులు వదులుకున్న మోతీలాల్, పటేల్, రాజాజీ, ప్రకాశం, సుభాస్‌ల వలె ప్రేమ్‌చంద్ సంపన్నుడు కాడు. పూట గడవడం ఉద్యోగం మీదనే ఆధారపడి ఉంది. శివరాణిని సంప్రదించారు. భర్త సాహచర్యంతో శివరాణికి సంస్కారం అలవడింది. ఆమె రచనలు చేయడం ప్రారంభించింది మహిళా ఉద్యమంలో కూడా పాల్గొన సాగింది.

''ఉద్యోగం వదిలేయండి. ఈ ప్రభుత్వాన్ని తుదముట్టించాల్సిన బాధ్యత మనమీద కూడా ఉంది'' అన్నారు శివరాణి.

''ఈలోగా మన పని ఏమవుతుందో ఆలోచించావా ?'' హెచ్చరించారు ప్రేమ్‌చంద్.

''ఆ(. అంతా ఆలోచించాను. దేశం మనకంటే ఉన్నతమయింది. ప్రధానం అయింది.''

''రాణీ ! నీవు చాల గొప్పదానివి. అవును. మనం త్యాగం చేయాల్సిందే. రేపే రాజీనామా ఇస్తాను. కాని కష్టాల్లో 'ఇంతమంది ఉద్యోగాలు చేస్తుండగా మీరెందుకు రాజీనామా చేశారండీ' అనవుగదా?''

''ఎందుకంటానూ? అందరిలో ఇలాటి త్యాగం ఉండొద్దూ.''

''ఇందులో నీవు ఊహించే త్యాగం, తపస్సూ ఏమీ లేవు. ఇది మన పాపాలకు ప్రాయశ్చిత్తం మాత్రమే.''

''మనమేం పాపం చేశాం ?''

''మనం కాకుంటే మన పెద్దలు చేశారు. దేశాన్ని మరచిన స్వప్రయోజన పరులవల్లనే మనకు బానిసత్వం ప్రాప్తించింది. భోగవిలాసాల్లో వళ్ళు మరిచి మనవాళ్ళే ఈ దేశాన్ని తెల్లవాళ్లకు అప్పగించారు ఈ తెల్లవాళ్ళు తమ శక్తి సామర్థ్యాలతో మన దేశాన్ని జయించారనుకుంటున్నావా ?''

ఆ తెల్లవారి ప్రేమ్‌చంద్ సర్కారు ఉద్యోగానికి సలాం కొట్టి తమ దేశభక్తిని నిరూపించుకున్నారు. అప్పట్నుంచీ కాంగ్రెస్ కార్యక్రమాల్లో పాల్గొనడం ప్రారంభించారు కాంగ్రెస్ సభల్లో పాల్గొనేవారు. రోజుల తరబడి బయట ఉండాల్సి వచ్చేది. రాత్రిళ్ళు చాల పొద్దుపోయేదాకా ఇంటికి చేరుకునేవారుకాదు

అసలు ఆరోగ్యమే అంతంతమాత్రం. శరీరం ఈ శ్రమకు తట్టుకోలేకపోయింది. జబ్బున పడ్డారు.

ఉద్యోగం వదిలింతర్వాత ఖాదీ ప్రచారం సాగించారు. చరఖాలు చేయించి అమ్మకం సాగించారు కొన్ని మగ్గాలు పెట్టించారు. కద్దరు నేయించారు. కొందరు స్త్రీలను చేర్చి వారితో నూలు వడికించేవారు.

అక్కణ్ణుంచి స్వగ్రామం లమహీ చేరుకున్నారు. అక్కడా కద్దరు ప్రచారం సాగించారు ఆ ఊరి జమీందారు నుంచి కఱ్ఱ సంపాదించారు. వడ్రంగుల్ని పెట్టి స్వంత ఖర్చుతో రాట్నాలు చేయించారు. అవి ఊళ్ళోవాళ్లకు పంచి, నూలు వడకడం నేర్పించారు.

ఊళ్ళోఉన్నా, ఉద్యమాలు నిర్వహిస్తున్నా, అనారోగ్యంగా ఉన్నా రచన మాత్రం మానుకొనేవారు కారు. రచనలో వారికి ఏదో ఆత్మానందం ఉండేది. రచన తన కర్తవ్యంగా భావించేవారు. ఇటు ఉద్యోగానికి రాజీనామా ఇచ్చినా, అటు ఉద్యమం నిర్వహిస్తున్నా రచన మానలేదు. ఉదయమే లేచి కాల కృత్యాలు తీర్చుకుని ఉపాహారం తీసుకుని రాయడానికి కూర్చునేవారు. మధ్యాహ్నం దాకా రాసేవారు. భోజనం, విశ్రాంతి ఆతరవాత సాయంకాలం దాకా రాసేవారు. సాయంకాలం పిల్లల్ని ఆడించేవారు. ఆ తరవాత ఊళ్ళో వాళ్ల వచ్చేవాళ్ల. వాళ్ళతో మాట్లాడ్తూ గడిపేవారు. ప్రేమ్‌చంద్‌తో మాట్లాడ్డం ఒక విందు. వారిలో ఉన్న ప్రత్యేకత ఏమంటే, వారు అందరి తోనూ సమానంగా మాట్లాడ్తారు. మాట్లాడేప్పుడు వారు మనతో కలిసిపోతారు. అంతస్తు అంతరం కనిపించదు. అందరితోనూ ఆప్యాయంగా, ఆత్మీయంగా మాట్లాడ్తారు. వారు నవ్వగలరు. నవ్వించగలరు. మనతో మాట్లాడేప్పుడు అంత మహా రచయితా అతి మామూలు మనిషి అయిపోతారు. అదీ ప్రేమ్‌చంద్ ప్రత్యేకత, విశిష్టత అంటారు ప్రేమ్‌చంద్‌కు సన్నిహితులు బనారసీదాస్ చతుర్వేది.

సంపాదనలేదు. ఉద్యోగంలేదు. రచనలమీద వచ్చిందాంతోనే గడవాలి. ఒకనాడు శివరాణి రొట్టెలు చేసి పెట్టారు. ప్రేమ్‌చందు పళ్ళెం ముందు కూర్చున్నాడు. రొట్టెల్లోకి నేయి లేదు. వట్టి రొట్టెలే ఉన్నాయి.

"నెయ్యి వేయలేదేం?" అడిగారు.

"ఇంట్లో నేయి లేదు."

నెయ్యి లేని రొట్టెలు తినలేక లేచిపోయారు ప్రేమ్‌చంద్. ప్రజలకోసం రచనలు చేసే రచయిత ప్రేమ్‌చందు. ఆదర్శాలకోసం వితంతు వివాహం చేసుకున్న సంఘ సంస్కర్త ప్రేమ్‌చంద్. దేశం కోసం సర్కారు ఉద్యోగాన్ని వదులుకున్న దేశభక్తుడు ప్రేమచంద్ ఆ ప్రేమ్‌చంద్‌కు రొట్టెల్లోకి నేయి సమకూర్చలేని సమాజం మనది. ఆర్థికంగా ప్రేమ్‌చందు ఎన్నో ఇబ్బందులు ఎదుర్కోవాల్సి వచ్చింది. అయినా వారు ఎవరిని అడిగేవారు కారు. ఒకరికి చేయి చాచేవారు కారు. చేతికి వచ్చిన అనేక అవకాశాలను ఆదర్శాల కోసం వదులుకున్నారు.

ప్రేమ్‌చంద్ లక్నోలో ఉన్న రోజులు. అలవర్ మహారాజా ప్రేమ్‌చంద్ రచనలతో ఎంతో ప్రభావితులు అయినారు. ప్రేమ్‌చంద్‌ను తమ ఆస్థానానికి విచ్చేయవలసిందని కబురు చేశారు. ప్రేమ్‌చంద్ అంగీకరించినట్లు కనిపించలేదు. రాజావారు మళ్ళీ మళ్ళీ మనుషులను పంపారు. కుటుంబంతో రమ్మన్నారు. బంగాళా ఇస్తామన్నారు. నెలకు నాలుగు వందలు ఇస్తామన్నారు. ప్రేంచందు ఆ వచ్చిన వారికి ఒక ఉత్తరం ఇచ్చి పంపించారు.

"తాము నా విషయంలో చూపిన దయకు ఎంతో కృతజ్ఞుణ్ణి. నా జీవితాన్ని సాహిత్యానికి అంకితం చేసుకున్నాను. మీకు నా నవలలూ, కథలూ నచ్చినందుకు ధన్యవాదాలు. తాము నాకు ఇవ్వదలచిన పదవిని స్వీకరించే యోగ్యత నాకు లేదు. వీలుబట్టి తమ దర్శనం చేసుకుంటాను.

సాహిత్య సేవకుడు - ధన్‌పత్‌రాయ్

హేలీ అనేవాడు గవర్నరుగా వచ్చాడు. అతను ఒక మిత్రునితో "ధన్‌పత్‌రాయ్‌కి ఉత్తరం రాయండి. వారి పుస్తకాలంటే నాకు చాల ఇష్టం. భారతదేశంలో ఇవ్వాళ ఉన్న రచయితలందరిలోని ప్రేమ్‌చంద్ గొప్ప రచయిత వారికి "రాయ్ సాహబ్" బిరుదు ఇవ్వదలచుకున్నాను" అన్నాడట.

గవర్నర్‌నుంచి ఉత్తరం అందింది. దాన్ని గురించి శివరాణితో చర్చించారు.

"గవర్నరు నాకు 'రాయ్ సాహబీ' ఇస్తానంటున్నాడు."

"ఇంకేం, రాయ్ సాహబీ మాత్రమే ఇస్తారా ? మరేమయినా ముట్ట చెపుతారా ?"

''చూడబోతే ఏదో ఇచ్చే వ్యవహారంగానే ఉంది. ఇదంతా ఎందు కోసమో తెలుసా ? నేను ప్రజలకు దూరమైపోవాలని, భట్రాజు పొగడ్తలు సాగించాలని ప్రభుత్వ ఉద్దేశం.''

''అంటే?''

''అవును. అందరూ చేయడం లేదా ? ఇప్పుడు నేను స్వేచ్ఛగా ప్రజ లకు దగ్గరగా రాయగలుగుతున్నాను. రేపట్నుంచి ప్రభుత్వాన్ని సంతోషపెట్ట డానికి రాయాలి. ఏమంటావ్ ?''

''నాకు ఇష్టమే. లాభకరమైన వ్యాపారంలాగానే ఉంది.'' భర్తను ఉడికించడానికి అన్నది.

''నా గొంతులో ప్రాణం ఉండగా ఇలాంటి వాటికి కక్కుర్తిపడను.'' అలాగే రాశారు.

''ధన్యవాదాలు. నేను సామాన్యుణ్ణి, ప్రజా సేవకుణ్ణి. ప్రజలు నాకు బిరుదులిస్తే కళ్ళకు అద్దుకుని స్వీకరిస్తాను. ప్రభుత్వం వారు ప్రసాదించే బిరుదులు పొందాలనే అభిలాష నాకు లేదు.''

## పేదరికం

ప్రేమ్‌చంద్ ఎప్పుడూ ఇంటిని అంటిపెట్టుకొని ఉండేవారు. సాధారణంగా ఇల్లు వదిలి కదిలేవారు కారు. అందుకు కారణం ఒకటి-వారి మనస్తత్వం. ప్రచారం అంటే వారికి ఇష్టం ఉండేది కాదు. రెండు-ఆర్థికం అయిన ఇబ్బందులు.

ఒకసారి జపాను మహా కవి ''నగూచీ'' కలకత్తా వచ్చారు. నగూచీని ప్రేమ్‌చంద్‌కు పరిచయం చేయాలనుకున్నారు ఒక మిత్రులు. కలకత్తా రావల సిందని ప్రేమ్‌చంద్‌కు రాశారు. దానికి జవాబు ఇలా రాశారు:

''మీ ఉత్తరం అందింది. కృతజ్ఞతలు. నగూచి ఉపన్యాసాలు వినాలనే అభిలాష ఉంది. కాని ఎలా రావడం? కుటుంబాన్ని వదలిరావడం ఒక సమస్య. పిల్లలు అలహాబాదులో చదువుకుంటున్నారు. శివరాణి వంటరిది అయిపోతుంది. ఆమెనుకూడా వెంటతీసుకురావాలంటే డబ్బు కావాలి. డబ్బుకోసం వెదుక్కున్న దానికంటే ఇంటిని అంటిపట్టుకుని ఉండడం మేలు.''

శాంతినికేతనం చూడ్డానికి కలకత్తా రావలసిందని రాసిన మిత్రునికి ''నాకు కలకత్తా రావాలనే ఉంది. కాని కలకత్తా చూడ్డానికి వచ్చి పరులతో

డబ్బు ఖర్చు పెట్టించడం నాకు ఇష్టంలేదు. అవకాశం వచ్చినప్పుడు తప్పక వస్తాను'' అని రాశారు. ఈ తడవకూడా డబ్బు ఇబ్బందే ప్రధానం అయిన కారణం అయి ఉంటుంది.

ఇంటిని అంటిపెట్టుకునే అలవాటు మంచిది కాదనీ, ప్రయాణాలు చేసి దేశం చూచి, ముసలివానిగా కాక పడుచువానివలె మసలుకోవాలనీ ప్రేమ్‌చంద్‌ను విమర్శిస్తూ చతుర్వేది రాశారు. అందుకు జవాబుగా యువతను గురించి రాశారు:

''వయసు మనసుకు సంబంధించింది. మనస్తత్వానికి సంబంధించింది. యువకులు నాకంటే ముసలివారున్నారు. వృద్ధుల్లో నాకంటే యువకులున్నారు. నేను నానాటికీ యువకుణ్ణి అవుతున్నాను అనుకుంటున్నాను. నాకు పరలోకాల మీద నమ్మకంలేదు. కాబట్టి పారలౌక్య జీవితాన్ని గురించి ఆలోచించను. ఆ జీవితాన్ని ఆశించను. పరలోకాన్ని గురించిన ఆలోచనలు మనిషిలోని యువతను చంపేస్తాయి. యువకుల్లోనూ ఆరోగ్య యువకులు, ఉన్మాద యువకులూ ఉన్నారు. ఆరోగ్య యువకులది ఆశావాదం. వారిది ప్రగతి పథం. తమ మార్గంలోని ఒడుదుడుకుల్ని గమనించుకుంటూ సాగిపోతారు. గుడ్డిగా ఉరకరు. ఉన్మాద యువకులు తమ శక్తి సామర్థ్యాల్ని గ్రహించరు. అందని వాటిని గురించి కలలు కంటారు. వారు అతిశయులు. నావరకు నేను కలలు కనడం మానేశాను. అతిశయం అందకుండా పోయింది. అనుభవం వల్ల అర్థం చేసుకున్నదేమంటే-సంతృప్తిని మించిన ఆనందం లేదు. సంతుష్టమైన కుటుంబాన్ని మించిన వరం మరొకటి లేదు.''

ప్రేమ్‌చంద్ కార్యసాధకులు. అతడు కర్మయోగి. అతనికి పేదరికం, అనారోగ్యం ఇలాంటివేవి అడ్డురాలేదు. రచనావ్యాసంగం మహాతపస్సులా సాగించాడు. ప్రేమ్‌చంద్ భర్తృహరి చెప్పిన కార్యసాధకునిలా కనిపిస్తారు. ఇది భర్తృహరి శ్లోకానికి ఏనుగు లక్ష్మణ కవి తెలుగు సేత:

ఒకచో నేలను పవ్వళించు నొకచో నొప్పారు పూసెజ్జపై
నొకచో శాకము లారగించు నొకచో నుత్కృష్టశాల్యోదనం
బొకచో బొంత ధరించు నొక్కొకతరిన్ యోగ్యాంబరశ్రేణి లె
క్కకు రానీయడు కార్యసాధకుడు దుఃఖంబున్ సుఖంబున్ మదిన్.

ప్రేమ్‌చందు మనసు వెన్నలాంటిది. పరుల కష్టాలు వింటే ఇట్టే కరిగి పోయేవారు. ఇబ్బందుల్లో ఉన్నవారిని ఆదుకునేవారు. తాము బాధపడుతున్నా పరులకు సాయం చేసేవారు. అయితే వారిలోని బలహీనతను వాడుకొని వారిని వెక్కిరించిన వారు లేకపోలేదు. పేదరికాన్ని అనుభవిస్తూనే పరులకు సాయ పడిన సంఘటనలు చాల ఉన్నాయి.

ఒకరోజు ఒక ఆగంతుకుడు ప్రేమ్‌చంద్ దగ్గరికి వచ్చాడు. తన కష్టాలు వెళ్లబోసుకున్నాడు. తన కోటు రైల్లో పోయిందన్నాడు. పర్సు కూడా కోటు లోనే ఉందన్నాడు. అదీ పోయిందన్నాడు. కన్నీరు పెట్టాడు. పదిహేను రూపాయలు అప్పడిగాడు. మళ్ళీ పువ్వుల్లో పెట్టి సమర్పించుకుంటానన్నాడు. ప్రేమ్‌చంద్ దగ్గర డబ్బులేదు. శివరాణిని అడిగారు.

''ఫీజు డబ్బుమాత్రం ఉంది."

''ఏదో ఒకటి ఇవ్వు. పాపం, కష్టాల్లో ఉన్నాడు మానవుడు."

''సమయానికి తిరిగి ఇవ్వకపోతే? ''

''అదంతా తరవాత చూసుకుందాం. ముందు అతన్ని ఆదుకోవడం మన పని.''

15 రూపాయాలు ఇచ్చి పంపారు. వారం తరువాత భార్యా పిల్లల్ని తీసుకుని దిగాడా పెద్దమనిషి. మకాం ప్రేమ్‌చంద్ ఇంట్లోనే. మళ్ళీ పాతిక ఇమ్మని కూర్చున్నాడు. నలుగురిని మేపిన దానికంటే పాతిక ఇచ్చుకున్నదే మేలని ఇచ్చి పంపించారు.

ప్రేమ్‌చంద్ కాన్పూరులో నివాసం ఏర్పరచుకున్నారు. ఆ రోజుల్లో గ్వాలియర్ నుంచి ఒక ఉత్తరం వచ్చింది. తనకు నెలకు నూరు రూపాయల ఉద్యోగం వచ్చిందనీ, దానికి నూరు రూపాయలు అమానతు కట్టాలనీ, నూరు రూపాయలు పంపుతే ఆజన్మాంతం రుణపడి ఉంటానని రాశాడొక వ్యక్తి. తాను నూరు పంపకుంటే ఆ వ్యక్తికి ఉద్యోగం రాకుండా పోతుంది అనుకున్నాడు ప్రేమ్‌చందు శివరాణిని అడిగారు. ఒకసారి మోసపోయారు. అయినా ఆమె కూడా జాలి పడింది. వంద రూపాయలు మని ఆర్డరు పంపారు ఈ డబ్బు తాను కాదు శివరాణి పంపుతూందని రాశారు. తరువాత కొద్ది రోజులకు ఆ మనిషి స్వయంగా దిగాడు. నెల సెలవు పెట్టివచ్చానన్నాడు. తన తల్లి చనిపోయిం దన్నాడు. తండ్రి రెండో పెళ్లి చేసుకున్నా దన్నాడు. ఇహ తాను ఆ గడప

తొక్కన్నాడు. ఈ ఇంటినే తన ఇంటిగా భావించుకుంటానని ప్రేమ్‌చంద్ ఇంట్లో మకాం వేశాడు. రెండు మూడు రోజులు ఇంట్లో ఉంచుకుని హోటల్లో ఉంచారు. 15 రోజులు ఉండి వెళ్ళిపోయాడు. మళ్ళీ వచ్చాడు. మనసు కరిగేలా తన దీనత్వాన్ని వెల్లించాడు. మళ్ళీ 50 అడిగాడు. ఇచ్చారు. తీసుకుని వెళ్ళిపోయాడు.

ప్రేమ్‌చంద్ లక్నో వెళ్ళినపుడు మళ్ళీ కలిశాడు. పాట్నాలో పెళ్ళి చేసుకుంటున్నానన్నాడు కాబోయే భార్యకోసం బంగారుగాజులు, చెవులకు దిద్దులు, పట్టు చీరలు కొని ఇచ్చి, కర్చులకుగాను వందరూపాయలు ఇచ్చి పంపించారు. తరువాత భార్యతో ఆ వ్యక్తి లక్నో వచ్చాడు. మకాం ప్రేమ్‌చంద్ దగ్గరే. మూడో రోజుకల్లా అతన్ని వెతుక్కుంటూ పోలీసులు వచ్చారు. అతను పరారీలో ఉన్న మనిషట!

ఉదారుడు విచక్షణ ఎరుగక సాయం చేస్తాడు. వంచకునికీ విచక్షణ లేదు. వాడు అందరినీ వంచిస్తాడు.

మళ్ళీ చాలసార్లు అనేక మందికి ఇలాగే సాయం చేసి మోసపోయారు.

ఒకనాడు కంసాలి వచ్చాడు శివరాణి దగ్గరికి. ''బాబుగారు ఒక బెంగాలీ బాబుకు నగలు చేయించి ఇచ్చారు. మజూరీ ఇవ్వాలి'' అన్నాడు. బట్టల దుకాణంవాడు వచ్చాడు.''బాబుగారు ఎవరికో బట్టలు ఇప్పించారు. బాకీ చేశారు.'' అడిగాడు.

"మీరెందుకిలా మరొకళ్ళకోసం అప్పులు చేస్తారు? అప్పుల వాళ్ళను ఇంటిమీదికి తోల్తారు?''

''నువ్వు ఉద్యోగం కోసం వంద రూపాయ లిచ్చావే అలాగే. ఏం చేయమంటావు-వాళ్ళను చూస్తే జాలేస్తుంది. అప్పుడు ఇవన్నీ ఆలోచించను.''

''మీకేం తెలుస్తుంది, సంసారం ఎంత పొదుపుగా చేస్తే ఈ మాత్రం డబ్బు మిగల్చగలుగుతున్నానో. ఒక్కొకప్పుడు దమ్మిడీ దమ్మిడీకి కష్టపడ్డాం గుర్తుందా?''

''నాకు మాత్రం నిన్ను మోసం చేయాలని ఉంటుందా రాణీ! ఏం చేయమంటావు, ఈ దుర్మార్గులు నా ప్రాణం తీస్తున్నారు."

''ఇక నుంచి డబ్బు మీ చేతి మీదుగానే వాడండి. దొంగచాటు వ్యవహారంతో ఆత్మద్రోహం చేసుకోకండి.''

''రాణీ ! దొంగతనం నీ దగ్గిరేగా ! నీవు అంత కఠిన శిక్ష విధించవని నాకు తెలుసు.''

''ఇవ్వాళ్టి నుండి మీ డబ్బులో దమ్మిడీ కూడా అంటుకోను.''

''అలా అనకు రాణీ ! ఇవ్వాళ్టి నుంచి నేను ఎవరికీ ఒక్క దమ్మిడీ కూడా ఇవ్వను. బరువుభారం సొంతం నీదే."

శివరాణి సర్వ విధాలా ప్రేమ్‌చంద్‌కు అర్ధాంగిలా ప్రవర్తించింది. శివరాణి ఆదర్శనారి. ప్రేమ్‌చంద్ ఆదర్శభర్త. శివరాణి లాంటి భార్య లేకుంటే బహుశా ప్రేమ్‌చంద్ అలాంటి రచనలు, అన్ని రచనలు చేయగలిగేవారు కారేమో ! ప్రేమ్‌చంద్‌కూ శివరాణి అంటే ఎంతో ఇష్టం. ఆమె వెంట లేకుండా ఎక్కడి కయినా వెళ్ళాలంటే బాధపడేవారు. శివరాణీ ప్రేమచంద్రులది ఆదర్శ దాంపత్యం.

1924 లో ఒకసారి శివరాణికి జబ్బు చేసింది. ఆరు నెలలపాటు ప్రేమ్ చంద్ కలం పట్టలేదు. ఇంట్లో పన్నులన్నీ స్వయంగా చేసేవారు. ఆమెను వదలి కదిలేవారు కారు.

''ఏదైనా రాసుకోండి. పని లేకుండా ఎందుకు కూర్చుంటారు?' అన్నారు శివరాణి భర్త మనసు మళ్లించాలని.

''నీవు ఇలా ఉన్నన్నాళ్ళూ నేనేమీ రాయలేను.''

''అదే తగ్గిపోతుంది. దిగులెందుకు ?'' వ్యాధి తగ్గటం లేదని తెలిసీ భర్తను ఓదార్చాలని అన్నది.

''తగ్గే లక్షణాలేమి కనిపించడంలేదు. నీవు నా దగ్గర దాస్తున్నావు.''

''ఆ రోజు వస్తే తప్పించడం తరమా ? అయినా నేను పోతే మీకేం మునుగుతుంది ?"

''నాకేం మునగదు. నేనే మునిగిపోతాను'' అని జలజలా కన్నీరు కార్చారు ప్రేమ్‌చంద్.

1931 నాటిమాట. ఉద్యమం ఉధృతంగా ఉంది. ప్రేమ్‌చంద్, శివరాణి ఇద్దరూ జైలుకు వెళ్ళాలని ఉరుకులు పెడుతున్నారు. తాను జైలుకు వెళ్ళి భర్తను తప్పించాలని ఆమె సంకల్పం. అప్పుడు వారు లక్నోలో ఉన్నారు. ప్రేమ్‌చంద్

బనారస్ వెళ్ళారు. శివరాణి సత్యాగ్రహం చేసింది. అరెస్టయింది. జైలుకు వెళ్ళింది. ప్రేమ్‌చంద్‌కు బెనారస్‌లోనే ఈ విషయం తెలిసింది. పరు గెత్తుకొని వచ్చారు. మధ్యాహ్నం జైలుకు వెళ్ళారు భార్యను చూడ్డానికి.

"జైలుకు వచ్చావా ?" అడిగారు. గొంతు పూడుకుపోతూంది. కన్నీరు నిలుస్తూంది.

"అవును మీరెలా ఉన్నారు ?"

"నాకేం, బయట ఉన్నాను. జైల్లో నీకెలా ఉందో చెప్పు."

"నాకేం, బావున్నాను. ఇక్కడేం కష్టంలేదు." నవ్వు తెచ్చిపెట్టుకొని అన్నారు శివరాణి.

"ఇక్కడ నీవు ఖైదీవి అయ్యావు. అక్కడ నన్ను బందీని చేశావు" అన్నారు. గుడ్లల్లో నీరు నిలవలేదు. "మనం ఇద్దరం ఒకే నావలో ప్రయాణం చేసే యాత్రికులం మనిద్దరి గమ్యస్థానాలు ఒకటే" అన్నారు.

జైలునుంచి వచ్చింతరవాత శివరాణి వదిన "నీవు జైలుకు వెళ్ళినప్పటినుంచీ మానవుడు నవ్విన పాపాన పోలేదు. నీవు వచ్చావా, ఈ ఇంటికి జీవితం వచ్చింది. ఆ మనిషికి వెలుగు వచ్చింది" అన్నారు.

అలాంటిది వారి దాంపత్యం. విధి విపరీతం అయింది. ప్రేమ్‌చంద్‌ను ముందే ఎత్తుకొని వెళ్ళిపోయింది. శివరాణి 'ప్రెమ్‌చంద్ ఘర్ మేవ' అనే పుస్తకం రాశారు. అవి భర్తతో వారి అనుభవాలు. ఆ పుస్తకంలోని చివరి వాక్యాలు -

"ఇన్ని రోజులు అణచుకున్న దుఃఖం కట్టలు తెంచుకుంది. ఇవాళ్టికీ ఏడుస్తూనే ఉన్నాను. ఇక రాయటం నావల్ల కానిపని. ఏడవటానికే జీవించి ఉన్నాను."

## మహాత్ముడు

గాంధీ మహాత్ముడు తన జీవిత కాలంలో భారతజాతిని ప్రభావితం చేశాడు. ముఖ్యంగా స్వాతంత్ర్య ఉద్యమ కాలంలో అతని ప్రభావానికి లోను కాని రంగం లేదంటే అతిశయోక్తి కాదు. అది అతి సామాన్యోక్తి.

గాంధీజీ ఆశయాలకూ ప్రెమ్‌చంద్ విశ్వాసాలకూ చాల సామ్యం ఉంది. ఒకరు రాజకీయోద్యమాలు నిర్మించారు. నిర్వహించారు. విజయం సాధించారు. మరొకరు తమ రచనల ద్వారా జనుల ఆలోచనా సరళిని మార్చడానికి ప్రయత్నించారు.

ప్రేమ్‌చంద్ రచయిత. ఆతడు రాయగలడు. చేయించలేడు. భర్తృహరి ఏనాడో అన్నాడు "జీర్ణమంగే సుభాషితమ్."

"మహాత్మునిలో నేను ఊహించిన దానికంటె ఎక్కువ గొప్పతనాన్ని గ్రహించ కలిగాను. ఆయన రూపం, ఆయన మాటలు సూదంటూరాయిలా అందరినీ ఆకర్షిస్తాయి. ఎంతటి అబద్ధాలకోరయినా వారి ముందు నిజం చెప్పేస్తాడు. ఎలాంటి దుర్మార్గునిలోనయినా అణకువ, ప్రేమా ప్రవేశిస్తాయి. ఏదో అనూహ్యమయిన ఆకర్షణ ఆయనలో చూచాను" అంటారు.

1928 లో ప్రయాగలో 'హిందూస్తానీ అకాడమీ' సమావేశం జరిగింది. మహాత్ముడు ఆ సభల్లో పాల్గొంటారని తెలిసింది. తనకు మహాత్ముని కలుసుకోవాలని ఉందని ప్రేమ్‌చంద్ మహాత్ముని కార్యదర్శి సుందర్‌లాల్‌కు రాశారు. అప్పుడు ప్రెమ్‌చంద్ లక్నోలో ఉన్నారు. మహాత్ముని దర్శనానికని నాలుగు రోజులు ముందే ప్రయాగ వెళ్ళారు. సమావేశాలు జరిగాయి. ముగిశాయి. ప్రెమ్‌చంద్‌కు గాంధీజీ దర్శనం కానే లేదు. అయినా వారు విసుక్కోలేదు. "మహాత్మునికి తీరిక ఎక్కడ ? వేలకొద్ది మందిని కలుసుకోవాలి. అనేక ఉత్తరాలు చదువుకోవాలి పైగా అందరివలె నేను వారి దర్శనం మాత్రం కోరలేదు. వారితో కొంత సేపు మాట్లాడాలనుకున్నాను. అంత సమయం వారికి లేదు" అన్నారు.

1935 లో హిందీ పరిషత్ వార్ధాలో జరిగింది. మహాత్ముడు స్వయంగా ప్రేమ్‌చంద్‌ను పిలిపించారు. వారు "హిందీ-హిందూస్తానీ" సమస్యను గురించి చర్చించారు. హిందీ-ఉర్దూలు కలిసిన హిందూస్తానీ భాష రాష్ట్రభాష కావాలనేది ప్రేమ్‌చంద్ ఆశయం. ప్రేమ్‌చంద్‌కు రెండు భాషలమీద అభిమానమే. వాస్తవంగా ప్రెమ్‌చందు ముందు ఉర్దూలోనే రాశారు. వారు రాయడం ప్రారంభించింది ఉర్దూలోనే. 1913 నుంచి వారు హిందీలో రాయడం ప్రారంభించారు. భాషల పేరుతో తగాదా రాకూడదని వారిఉద్దేశం కేవలం ఛాందసంతో భాషలను దుర్వినియోగ పరచరాదనేది వారి సిద్ధాంతం.

"భాష సాధారణ ప్రజలకు అర్థం అయ్యేదిగా ఉండాలి. హిందీ ఉర్దూలు కలిసిన భాషను అందరూ అర్థం చేసుకోగలరు. అదే హిందుస్తానీ. మనదేశాన్ని హిందుస్తాన్ అనటానికి మనకు అభ్యంతరం లేదు. అలాంటప్పుడు భాషను

హిందుస్తానీ అనడానికి మనకు అభ్యంతరం ఎందుకుండాలి ? అందుకోసం మనం తలలు బద్దలుకొట్టుకుని ఎందుకు చావాలి?'' అని ప్రశ్నిస్తారు ప్రేమ్‌చంద్.

''జనం సాధారణంగా మాట్లాడేది రాష్ట్ర భాష కావాలి. అందులో సంస్కృతం, ఫారసీలాంటి ఏ భాషలు కలిసినా అభ్యంతరం చెప్పరాదు. దేశంలో ఎన్నో జాతులున్నాయి. అవి కాలక్రమేణా కలిసి పోతున్నాయి. అందుకు ఎవరూ అడ్డు చెప్పడం లేదు. భాషలో పదాలు కలవడం విషయంలో మనం కొట్టుకు చస్తున్నాం'' అంటారు.

ప్రెమ్‌చంద్ వాళ్లు బొంబాయిలో ఉన్నపుడు అక్కడ కాంగ్రెస్ సభలు జరిగాయి. ఇరవయ్యేసి రూపాయల టిక్కెట్లు కొని కాంగ్రెస్ సభలకు వెళ్ళారు- ప్రెమ్‌చంద్, శివరాణి, వారి కూతురూ, అల్లుడూ వెళ్ళారు ప్రెమ్‌చంద్ లోనికి వెళ్ళి మహాత్ముని దగ్గరగా కూర్చున్నారు. శివరాణి వాళ్లు జనంలో దూరంగా కూర్చున్నారు. మహాత్ముడు ఉపన్యసించడానికి లేచారు. సభలో గందరగోళం మొదలయింది. తొక్కుకోవడం మొదలయింది. ఆ గొడవలో శివరాణిని ఎవరో తొక్కేశారు. ప్రాణాలతో బయటపడడం గగనం అయింది. ఆ రద్దీలో అల్లుడు తప్పిపోయాడు. సరే ఇంటికి వచ్చి అందరూ కలుసుకున్నారు. తెల్లవారి వారివెంట సభలకు రానని భీష్మించుకుంది శివరాణి.

''తన ఉపన్యాసం వినడానికి వచ్చిన వాళ్లు ఇంత గొడవ చేశారని తెలిస్తే మహాత్ముడు నిరశన వ్రతం పూనవచ్చు.'' ప్రేమ్‌చంద్.

"పాపం, వారు అంతకంటే ఏంచేయగలరు ? '' శివరాణి.

''మహాత్ముడు మరో దేశంలో జన్మించి ఉంటే పూవుల్లోపెట్టి పూజించే వారు.''

''అంత జాగృతి ఉన్న దేశంలో మహాత్ముల అవసరం ఉండదు.''

''క్రీస్తును శిలువ వేశారు. మహమ్మదు నీళ్లు పుట్టక అల్లాడాడు. రామ క్రిష్ణులు ఎన్నో యుద్ధాలు చేశారు. ఇది గాంధీ యుగం. మహాత్ముడు కూడా ఎన్నో దుష్ట శక్తులను ఎదుర్కోవాల్సి ఉంటుంది.''

''చూస్తుంటే ఇదంతా అసంభవం లాగుంది.''

''జీవితం ఒక పోరాటం. పోరాటం లేని జీవితం ఎలా ఉంటుంది?''

''ఆ పోరాటానికి దూరం నుంచే దండం. నేను రాను బాబూ ! మహాత్ముణ్ణి చూడ్డంతోనే వారి శిష్యులు అయిపోయినట్లున్నారు''

''వారిని చూడక ముందే నేను మహాత్ముని శిష్యుణ్ణి-నా సిద్ధాంతాలు వారి సిద్ధాంతాలకు అనుగుణంగా ఉన్నాయి. మహాత్ముడు కార్మిక కర్షక సమస్యలను విడదీయాలని చూస్తున్నారు. నేనూ నా రచనల ద్వారా అదే చేయాలని ప్రయత్నిస్తున్నాను. వారు హిందూ ముస్లిం అయిక్యత కోసం పాటు పడుతున్నారు. నేను హిందీ-ఉర్దూలను అయిక్యం చేసి హిందుస్తానీని బలపరచడానికి ప్రయత్నిస్తున్నాను.''

## ప్రచురణ బాధ్యతలు

ప్రేమ్ రచనను ఒక ఉద్యమంగా నిర్వహించారు. ఉబుసుపోకకుగానీ కీర్తి కోసంగాని వారు రచనలు చేయలేదు. భారత దేశంలోని కోట్లాది అమాయకుల ఆర్తనాదాలు వినిపించడానికి రచనలు చేశారు. కోట్లకొద్దీ మూగ గుండెలకు బాస నేర్పడానికి రచనలు సాగించారు. మూగ గుండెలకు నాదం నేర్పడానికీ, నినాదాలు ప్రతిధ్వనింప చేయడానికీ రచనలు చేశారు. వారి కలంలో బలం ఉంది. అది సున్నితం అయిన చిత్రాలు గీసే కుంచె కాదు. అది దుష్టశిక్షణకు ఎక్కుపెట్టిన బాణం. వారి ధనుస్సులోంచి వెలువడిన బాణాలు వాడియైనవి. అవి సూటిగా లక్ష్యాన్ని భేదించే రామ బాణాలు.

ఈ దేశంలో రచయిత తన రచనలమీద జీవించలేడు అని వాపోయారు ప్రేమ్‌చంద్. రాసేవానికి వచ్చే ప్రతిఫలం నామమాత్రం కూడా కాదు. ఒక పత్రికలో 24 కాలమ్‌లు రాసినందుకు ఎనిమిది రూపాయలు ఇస్తామన్నారు. అది రాబట్టుకోవడానికి ప్రేమ్‌చంద్ అనేక ఉత్తరాలు రాయాల్సివచ్చింది. ''సేవాసదన్'' ప్రచురించిన ''హిందీ పుస్తక్ ఏజన్సీ'' వారు నాలుగు వందలు ఇచ్చారు. ఇలా జరుగుతున్న అన్యాయం నుంచి రచయితలను కాపాడాలని ప్రేమ్‌చంద్ సంకల్పం.

''స్వంత లాభం కోసం పాకులాడే ప్రచురణకారుల అవసరం లేదు. రచయితలకు ప్రచురణకారులకు మధ్య ఒక కుటుంబంలో వాళ్లలాంటి సంబంధాలుండాలి. రచయితలకు నిరాశ కలిగించరాదు. జీవితావసరాలు తీరక అసంతృప్తితో అలమటించేవాడు సజీవ సాహిత్యం సృష్టించలేడు'' అంటారు.

రచయితకు న్యాయం కలుగచేయాలనే సంకల్పంతో మున్షీ దయా నారాయణ్‌తో కలసి ''హిందుస్తానీ అకాడమీ'' ని స్థాపించారు. అయితే కొద్ది

కాలంలో అకాడమీ సరిగా పని చేయడం లేదని తెలుసుకున్నారు. స్వప్రయోజన పరులు అందులో చేరినట్లున్నారు.

"కొత్తగా రాసేవాళ్లకు ప్రోత్సాహం కలిగించాలి. పండితులూ, పెద్ద రచయితలూ యువకులను నిరుత్సాహపరుస్తున్నారు. అది చాల తప్పు. మనం అభ్యుదయ సాహిత్యాన్ని సృష్టించాలి. అప్పుడే సాహిత్యంతోపాటు సామాజిక రాజకీయ రంగాలలో కూడా ప్రగతి సాధ్యం అవుతుంది" అన్నారు.

అకాడమీ వలన తమ ఆశయం ఫలించలేదని గ్రహించిన ప్రేమ్‌చంద్ ఒక ప్రెస్సు పెట్టారు. అందులో మంచి పుస్తకాలు అచ్చు వేయాలని వారి సంకల్పం. కాని సత్సంకల్పానికీ వ్యాపారానికీ చాల దూరం. అందుకే ప్రెస్సుతో నానా యాతనలు పడ్డారు. ఆ ప్రెస్ మేనేజరు టక్కరి. పనివారిని బాధలు పెట్టేవాడు. ప్రెస్సులో హర్తాళ్ జరిగింది. పనివాళ్ళ పక్షాన పలికిన యజమాని ప్రేమ్‌చంద్. అయితే నష్టంతో నడిచే ప్రెస్సు పనివాళ్ళను సంతోష పెట్టడం మాటలు కాదు.

ప్రేమ్ ఒక ఆదర్శ యజమానియై చూపారు.

"పాఠకుల హృదయాలలో రచయితకు స్థానం దొరకనంతవరకు రచయిత ఉపదేశంవల్ల ప్రయోజనం లేదు" అని గ్రహించిన ప్రేమ్‌చంద్ "హంస" అనే పత్రిక ప్రారంభించారు. పత్రికల ద్వారా సందేశం అందించాలని వారి ఆశయం.

1930 మార్చిలో హంస పత్రిక ప్రారంభానికిముందు ప్రేమ్‌చంద్ తన మిత్రుడు నిగమ్‌కు ఇలా రాశారు: "ఇదొక అవివేకం, తలనొప్పి, లాభం లేనిపని. అయినా నేను ఏదో ఒక తలివి తెక్కువ పని చేయాలిగా! నా జీవితం సాంతం అవివేకంతోనే నిండిపోతుంది."

ప్రభుత్వం 'హంస' మీద కన్నెర్ర చేసింది. వేయి రూపాయలు ధరావత్తు కోరింది.

ఇది సరిపోదా అన్నట్లు వినోద్‌శంకర్‌వ్యాస్ నడుపుతూ ఉండిన "జాగరణ్" కూడా నెత్తిన వేసుకున్నాడు. "ఇది ఎవరినీ కీర్తించదు. అయితే మర్యాదలను అతిక్రమించదు. అప్పుడప్పుడు కటువైన మాటలు విని పిస్తుంది" అన్నారు జాగరణ్ తొలి సంపాదకీయంలో.

"హంస", "జాగరణ్" పత్రికలు వారిని క్రుంగదీశాయి. బనారసీ దాస్‌కు రాసిన లేఖలో 'హంస'కు అంతగా ఖర్చుకావడంలేదు. కాని 'జాగరణ్' భరించరానిది అయింది. ప్రతి నెలా 200 మునుగుతున్నాను. ఈ సుడిగుండం లోంచి ఎలా బయటపడగలనో అర్థం కావడంలేదు.

వారికి రాత్రింబగళ్ళు రచయితల కష్టాల్ని గురించిన ఆలోచనే. సత్య జీవన్‌శర్మ గారి సహకారంతో "రచయితల సంఘం" స్థాపించారు. 1935 లో అభ్యుదయ రచయితల సంఘం స్థాపించబడింది. సభలు లక్నోలో జరిగాయి. ఇవి 1936 ఏప్రెల్ 9, 10 తేదీలలో జరిగాయి. సభలకు ప్రేమ్‌చంద్ అధ్యక్షత వహించారు.

"సాహిత్యంలో నవశక్తిని, చైతన్యాన్ని తీసుకొని రావడానికి ప్రయత్నించడం సంతోషం. ఇలాంటి సదుద్దేశంతో లండనులో భారతీయ అభ్యుదయ రచయితల సంఘం ఏర్పడింది. వారు పంపిన మానిఫెస్టో ఆధారంగానే మనం పయనింతాం.

"సాహిత్య రంగంలో ఐశ్వర్యాన్ని ప్రేమించేవారికి స్థానంలేదు. ప్రజాసేవయే ప్రధానంగా భావించే వారికే ఇక్కడ స్థానం ఉంది. స్పందించే గుండె గలవాళ్ళు, ప్రేమ ప్రసాదించగల వాళ్ళే ఇక్కడ కావాలి.

మనం సమాజ పతాకాన్ని ఎత్తి పట్టుకున్న సైనికులం" అన్నారు ఆనాటి అధ్యక్షోపన్యాసంలో.

## సినీరంగం

"హంస", "జాగరణ" నష్టంతో నడుస్తున్నాయి. ఆర్థికం అయిన ఇబ్బందులు పెరిగిపోతున్నాయి. అలాంటి సమయంలో బొంబాయి సినీరంగం నుంచి పిలుపు వచ్చింది. సేవాసదన్ ఆధారంగాతీసిన సినిమాకు ప్రేమ్‌చంద్‌కు 750 రూపాయలు ముట్టచెప్పారు. అజంతా సినీటోన్‌వారు ఆరు కథలు రాయమన్నారు. అందుకుగాను ఏడాదికి ఎనిమిదివేలు ఇస్తామన్నారు. ఆ పనికి ఒప్పుకోక తప్పలేదు.

"నేను కథలూ, నవలలూ రాసిందానికంటె సినిమా ద్వారా ఎక్కువ సేవ చేయగలను. ఈ దేశంలో చదవలేని వారు అసంఖ్యాకంగా ఉన్నారు. వాళ్లు సినిమా చూడ్డం వల్ల ప్రయోజనం పొందుతారు." సినిమా పనికి అంగీకరించడానికి ఇదొక కారణం,

ఈ సందర్భంలో జైనేంద్రకు ఉత్తరం రాశారు.

"అందుకు అంగీకరించడం తప్ప గత్యంతరం లేని స్థితిలో ఉన్నాను. ఒక సంవత్సరం పాటు బొంబాయికి వెళ్ళనే మంచిది అనుకుంటున్నాను. ఆ ఆధారం మీద 'హంస', "జాగరణ్" పత్రికలు నడుస్తాయి. నాకు డబ్బు ఇబ్బంది తొలగిపోతుంది." ఇది రెండో కారణం.

బొంబాయి చేరుకున్నారు.

ప్రేమ్‌చంద్ "మజ్దూర్" అనే సినిమాకు సంభాషణలు రాశారు. అది దేశభక్తుడయిన మిల్లు యజమాని కథ. ఆ చిత్రంలోని ఒకటి రెండు సన్ని వేశాల్లో ప్రేమ్‌చంద్ తెరమీద కనిపిస్తారు. ఈ కథ సెన్సార్ వారికి నచ్చలేదు అయినా పంజాబ్, ఢిల్లీ, సంయుక్త పరగణాలు, మధ్య పరగణాలలో ప్రదర్శించ బడింది. దాంతో ప్రజల్లో కల్లోలం చెలరేగింది. పోలీసులు కల్పించుకోవలసి వచ్చింది. భారత ప్రభుత్వం ఈ చిత్రాన్ని నిషేధించింది.

చలనచిత్ర రంగం ప్రేమ్‌చంద్‌కు సరిపడలేదు. వారి కథల్లో అనేక మార్పులు చేసి అసలు కథను అంతమొందించారు. అలాంటి కథలను కూడా ప్రభుత్వం సహించలేదు. తన సాహిత్యం ప్రజలకు అందుతుందని బొంబాయి వచ్చారు ప్రేమ్‌చంద్. "ఈ సినిమావాళ్లు ప్రజల బలహీనతలకు బానిసలు, వాళ్లకు డబ్బు ముఖ్యం. రచయితకు ప్రాముఖ్యం ఇవ్వరు" అన్నారు.

"సాహిత్యం ప్రజల అభిరుచిని మలచడానికి ప్రయత్నిస్తుంది. సినిమా అసభ్య భావాలను ప్రేరేపిస్తుంది. దీనికి విరుగుడు నిర్మాతల దగ్గర లేదు ఒక వస్తువుకు గిరాకీ ఉన్నంతకాలం అది బజారులో ఉంటుంది. సినిమాకూ సాహి త్యానికీ సామ్యరూపం రావడానికి చాలకాలం పడుతుంది. ప్రజల అభిరుచిలో మార్పు రావాలి. ప్రజలు తుచ్ఛం అయినవాటిని తృణీకరించాలి. అప్పుడు సినిమా సైతం సాహిత్యం లాంటి గుణాన్ని సంతరించుకుంటుంది" అన్నారు.

సినీరంగంలో ఆర్థికంగా కూడా వారు బాగుపడినట్లు కనిపించదు. జైనేంద్రకు ఇలా రాశారు:-

"బొంబాయి నుంచి నేను తెచ్చుకున్న దేమిటి? ఓటమి. అంతే. అక్కడ నాకు 6,300 వచ్చాయి. నా కొడుకులు 1500 తీసుకున్నారు. కూతురు 400. ప్రెస్సుకు 500 పోయాయి. ఎంత పొదుపుగా వాడినా బొంబాయిలో 2,500 ఖర్చయింది. నేను తెచ్చుకున్నది 1400. మిగిలింది పరాజయం మాత్రమే."

1934 లో ప్రేమ్‌చంద్ చలనచిత్ర రంగాన్ని గురించి చేసిన వ్యాఖ్యలు నేటికీ వర్తిస్తాయి. నాటికీ నేటికీ ఆ రంగం ఎదగలేదు. దిగజారింది. నిజమైన రచయితకు ఆ రంగంలో నాడూ స్థానం లేదు, నేడూ స్థానం లేదు. ఆ రంగానికి కావలసింది "వ్రాయసగాళ్ళు", రచయితలు కారు.

ప్రేమ్‌చంద్ స్వభావం ఇంటిని అంటిపెట్టుకోవడం. కాని చివరి రోజుల్లో పర్యటనలు సాగించారు. ఆహ్వానం వస్తే కాదనలేదు. అలహాబాద్, పూర్ణియా, లక్నో, ఢిల్లీ, లాహోరులకు వెళ్లారు.

దక్షిణ భారత హిందీ ప్రచార సభవారు మద్రాసుకు ఆహ్వానించారు. ప్రేమ్‌చంద్ దంపతులు మద్రాసు చేరుకున్నారు. వారికి ఘన స్వాగతం లభించింది. "చూడు, ఇది ఎంత అందమైన ప్రాంతమో! వీళ్ల మనసులు కూడా అందం అయినవి. వీళ్ల ఎంతో కాలం నుంచి పరిచయం ఉన్నవాళ్లలా ప్రవర్తిస్తారు. ఎంత ప్రేమ! ఎంత ఆదరణ!! ఈ తడవ పిల్లల్ని కూడా వెంట తీసుకొద్దాం" అన్నారు. మద్రాసునుంచి మైసూరు, బెంగళూరు కూడా వెళ్లారు.

## అస్తమయం

ప్రేమ్‌చంద్ ఆరోగ్యం అంత మంచిదికాదు. వారు అతిసార వ్యాధితో బాధపడుతుండేవారు. అజీర్ణం, అతిసారం వారిని క్రుంగదీశాయి. అనారోగ్యంలో కూడా వారు రచన మానలేదు. బొంబాయి నుంచి వచ్చిన తరువాత "గోదాన్" రచనలో నిమగ్నం అయిపోయారు. 1936 మే నెలలో గోదాన్ ప్రచురించబడింది. ఆ నవల ప్రేమ్‌చంద్ మూడు సంవత్సరాలపాటు నిరంతర పరిశ్రమ ఫలితం.

శివరాణి గోదాన్ చదివి ఎక్కెక్కి ఏడవసాగింది. ఎక్కిళ్ళు కూడా వచ్చాయి. ప్రేమ్‌చంద్ అక్కడికి వచ్చారు. ఏడ్పుకు కారణం అడిగారు.

"పాపం, హోరీని చంపి ధనియాను విధవను ఎందుకు చేశారు?" అని అడిగింది శివరాణి.

విధి విచిత్రం అయింది. ధనియాను కల్పనలో విధవను చేసిన ప్రేమ్‌చంద్ శివరాణిని వాస్తవంగా విధవను చేసి వెళ్ళిపోతారని ఎవరనుకున్నారు? ఒక్కొక్కసారి రచయితకు రానున్న పరిణామాలను దర్శించగల శక్తి కలుగుతుందేమో!

ప్రేమ్‌చంద్ జీవితంలో కోరికలు పెంచుకోలేదు. బనారసీదాస్ చతుర్వేదికి ఇలా రాశారు:

"నాకు కోరికలు లేవు. స్వాతంత్ర్య సమరంలో మనం గెలవాలన్నదే నా కోరిక. నాకు కీర్తికాంక్ష లేదు డబ్బుమీద అపేక్ష లేదు. బతకడానికి చాలినంత నాకుంది. కారు కావాలనీ, బంగళా కావాలనీ నేను కోరను. శక్తివంతములయిన రచనలు చేయాలనే కోరిక మాత్రం ఉన్నది."

1936 లో అతిసారంతోపాటు కడుపులో కురుపులయినాయి. జూన్ 16 నాడు రక్తపు వాంతులు చేసుకున్నారు. విరేచనాలయినాయి. తీవ్రమయిన కడుపునొప్పి. డస్సిపోయారు. నీరసించిపోయారు.

జూన్ 19 నాడు "ఆజ్" కార్యాలయంలో గోర్కీ సంతాప సభ జరిగింది. అక్కడికి వస్తానని మాట ఇచ్చారు. శివరాణి వారించినా వినలేదు. అంత జబ్బులోనూ రాత్రి సొంతం మెలుకువతో ఉండి ఉపన్యాసం రాశారు. రాత్రి రెండు గంటలకు శివరాణి లేచి చూస్తే ఉపన్యాసం రాస్తున్నారు.

"గోర్కీ సంతాప సభకు మీరు ఉపన్యాసం రాయకుంటే వచ్చే నష్టం ఏమిటి ? పైగా అతడు భారతీయుడు కూడా కాడు" అన్నారు శివరాణి.

"అది సంకుచిత మనస్తత్వం. గోర్కీ లాంటి మహా రచయితకు జాతీయత, దేశం అడ్డురావు. అతడు మానవాళికి మహా రచయిత" అన్నారు ప్రేమ్‌చంద్.

ప్రేమ్‌చంద్ సభకు వెళ్ళడమే ఘనం అయింది. ఉపన్యాసం చదవలేకపోయారు. మరొకరు చదవాల్సి వచ్చింది.

ఒకనాటి ప్రేమ్‌చంద్ పరిస్థితి మరీ విషమించింది. అలాంటి పరిస్థితిలో కూడా అప్పటికి వారు రాస్తుండిన "మంగళసూత్రం" నవల గురించి ఆలోచించారు. అది అసంపూర్ణంగానే ఉండిపోయింది. వారి చివరి వ్యాసం "మహాజనీ సభ్యత" (ధనస్వామ్య నాగరికత) వారి మరణ శాసనం లాంటిది.

"ధనస్వామ్య నాగరికతలో ప్రతి కదలికకు ధనమే ప్రేరణ.ధనస్వాములు, బాంకర్లు అధిక లాభాలు ఆర్జించడానికే పరిపాలన ఉపయోగపడుతుంది. అసలు ధనస్వాములే ఏలికలు. మానవ సమాజం రెండుగా చీలి ఉంది. శ్రామికులది పెద్ద భాగం. ఈ పెద్ద విభాగాన్ని బానిసలుగా చేసికొన్నది అల్ప విభాగం. తమ కోసం చెమటోడ్చే వారిమీద ధనస్వాములకు సానుభూతి లేదు. వాళ్ల తమకోసం

రక్తం ధారపోసి ఎన్నడో ఒకనాడు గుటుక్కుమంటారని ధనస్వాముల నమ్మకం.''

రష్యాలో అప్పటికి వచ్చిన విప్లవం ప్రేమచంద్‌ను ఎంతో ప్రభావితుణ్ణి చేసింది. నిగమ్‌కు రాసిన ఒక ఉత్తరంలో ''దాదాపు బోల్షివిక్ భావాలు అంగీకరిస్తున్నాను'' అని రాశారు.

''బలవంతుడు బలహీనుని రక్తం పీల్చడం అన్ని దేశాల్లోనూ ఉంది. కాని రష్యాలో మాత్రం అలాంటి వాళ్ళ రోగం బాగా కుదిర్చారు. అక్కడి పేద వాళ్ళు ఎంతో సంతోషంగా ఉన్నారు. కొంతకాలం తరవాత మన దేశంలో కూడా అలా జరగవచ్చు'' అన్నారు.

అక్టోబరు 7 వ నాటి రాత్రి విషమించింది.

''రాణీ ! నా జీవశక్తులన్నీ పోతున్నాయి'' అన్నారు ప్రేమ్‌చంద్. వారి మాటలు విన్నది శివరాణి. కన్నీరు ఆపుకోలేకపోయింది. రెండోరోజు మైకం వచ్చింది. విరేచనం అయింది. శుభ్రంచేద్దామని రాణి కదిలింది. వాళ్ళ అన్నయ్య ఆమె చేయిపట్టుకుని ''వారు ఇక లేరమ్మా!'' అన్నాడు.

అది 1936 అక్టోబరు 8వ తేది ఉదయం 7-30 గంటల సమయం.

# నవలలు

ప్రేమ్‌చంద్ ప్రజారచయిత. దేశభక్తుడు. సంఘసంస్కర్త. సమాజ సేవకుడు. ప్రేమ్‌చంద్ ప్రగతివాది. సమాజంలో అన్యాయాలను అక్రమాలను ఎదిరించడానికి జీవితాంతం పోరాటం జరిపిన కలమ్ కాసిపాహీ. ప్రెమ్‌చంద్ నవలల్లో ప్రజాజీవితాన్ని ప్రవేశపెట్టిన ఆద్యుడు. అతని నవలల్లో సమాజం సాక్షాత్కరిస్తుంది. అయితే సమాజం ఒకే పదార్థం కాదు. అది శాఖోపశాఖలు గల మహావృక్షం లాంటిది. సమాజాన్ని ప్రేమ్‌చంద్ అనేక దృక్కోణాలనుంచి పరిశీలించారు. వారికి పీడితవర్గం విషయంలో పక్షపాతం. వారు మన సమాజంలో అణగారిన జనంకోసం పోరాడారు. ప్రేమ్‌చంద్ స్వేచ్ఛకోసం, స్వాతంత్ర్యంకోసం పోరాడారు. వారు కోరింది రాజకీయ స్వాతంత్ర్యం మాత్రంకాదు. వారు కోరింది ఆర్థిక స్వాతంత్ర్యం-సాంస్కృతిక స్వాతంత్ర్యం. వారు బ్రిటిష్ ప్రభుత్వంతో పొరాడిందానికంటే తీవ్రంగా స్వదేశీ జమీందార్లతో పోరాడారు ప్రేమ్‌చంద్ దాస్యాన్ని ఎదిరించాడు. అది ఏ రూపంలో ఉన్నా వారి శత్రువే.

ప్రేమ్‌చంద్ ఒక లక్ష్యంతో, ఒక గమ్యంతో, ఒక చిత్తశుద్ధితో, ఒక ధ్యేయంతో నవలా రచన చేశారు. వారి నవలల్లో మనకు ఆ నాటి సమాజం-సమాజంలో పోరాటం కనిపిస్తాయి. వారి నవలలు అన్నింటినీ సమీక్షించడం స్థలాభావం వల్ల సాధ్యపడదు. వారి నవలల్లో ప్రత్యేకత, విశిష్టతగల మూడు నవలలను వివరంగా సమీక్షించి, మిగతావాటిని గురించి సంక్షిప్తంగా తెలియ పరుస్తాను.

రూఠీరాణీ అంటే అలిగిన రాణి. ఇది చారిత్రక నవల. రాజపుత్రుల సాహసాలను చిత్రిస్తుంది. అయితే వారిలో ఉన్న అనైక్యతను చూపి, దేశాన్ని రక్షించడానికి సాహసం మాత్రం చాలదు. ఐక్యత అవసరం అనే సత్యాన్ని చాటి చెపుతుంది.

ఉమాదేవి వివాహానికి రాజపుత్రుల రభస. మాల్దేవుని వధించడానికి మామగారే కుట్ర పన్నుతారు. ఉమాదేవి దాసి భరేలి. మాల్దేవుని రక్షించే

ప్రయత్నంలో తన గదికి తెస్తుంది. భరేలీని మోహిస్తాడు మార్దేవుడు. అది తెలిసి ఉమాదేవి అలుగుతుంది. మార్దేవుడు షేకషాను జయించాడు. ఉమాదేవి అలక తీర్చలేకపోయాడు.

వరదాన్ 1905 ప్రాంతంలో రాసిన సాంఘిక నవల. ఇందులో భగ్న ప్రేమతోపాటు దేశభక్తి, దేశసేవా కనిపిస్తాయి. ఆనాటి ఉద్యమాల తీరు గోచరిస్తుంది.

బ్రిజరాణిని ఇద్దరు ప్రేమించారు. ప్రతాప్, కమలచరణ్. బ్రిజరాణి పెళ్లి కమలచరణ్‌తో జరుగుతుంది ప్రతాప్ పెళ్లి చేసుకోడు దేశ సేవకు అంకితం అవుతాడు. సన్యాసిగా మారి బాలాజీ అవుతాడు. కమలచరణ్ చనిపోతాడు. బ్రిజరాణి ప్రతాప్‌ను మరవలేదు. బాలాజీ పేరు ప్రఖ్యాతులు విని మాధవి అతన్ని ప్రేమిస్తుంది. వారిద్దరూ విచిత్ర పరిస్థితుల్లో కలుసుకుంటారు. అయితే మాధవి సన్యాసిని అయి బాలాజీ వెంట వెళ్లిపోతుంది.

ప్రతిజ్ఞ వితంతు సమస్య కేంద్రంగా చేసి రాసిన నవల. స్వాతంత్ర్యోద్యమంతోపాటు సంఘ సంస్కరణ కూడా ఒక ఉద్యమంగా నడిచింది.

ప్రేమను అమృత్, దానానాథ్ ఇద్దరు ప్రేమిస్తారు. అమృత్ పెండ్లి ప్రేమతో నిశ్చయం అవుతుంది. అమృత్ వితంతువులను గురించి ఉపన్యాసం వింటాడు. పెండ్లి మానుకొని విధవల కోసం ఒక ఆశ్రమం ప్రారంభిస్తాడు. ప్రేమను దానానాథ్ పెండ్లాడ్తాడు.

పూర్ణ ప్రేమకు స్నేహితురాలు. ఆమె భర్త ప్రమాదవశాత్తు గంగలో మునిగిపోతాడు. కమలాప్రసాద్ అనే దుష్టుడు ఆమెను బలాత్కరించబోతాడు. ఆమె కుర్చీతో వాణ్ణి బాది పారిపోతుంది. విధవాశ్రమంలో చేరుతుంది. కమలా ప్రసాద్ కూడా మారిపోతాడు. మంచి జీవితం గడుపుతాడు.

సేవాసదన్ వేశ్యల సమస్యలను చర్చించే నవల. సమాజం వేశ్యలను సహిస్తుంది. కాని వేశ్య ఇంట్లో ఉండివచ్చిన కులకాంతను బహిష్కరిస్తుంది. జీవితంలో అందనిదానికోసం అర్రులు చాచిన వారి కథ.

సుమన్ తండ్రి పోలీసు అధికారి. నీతిపరుడు. కూతురు పెళ్ళికోసం లంచం తీసుకుని పట్టుబడ్డాడు. జైలుకు పోతాడు. సుమన్ పెళ్ళి పేదవానితో జరుగుతుంది. జగడాలతో భర్త ఆమెను ఒకనాడు వెళ్ళగొడ్తాడు. ఒక వేశ్య ఆమెకు ఆశ్రయం ఇస్తుంది. ఛాందసులు ఆమెను అక్కడా ఉండనీయరు.

సుమన్ చెల్లెలు శాంత పెళ్ళి నిశ్చయం అవుతుంది. అక్క విషయం తెలిసి పెళ్ళి ఎత్తిపోతుంది పద్మసింగ్ శాంతను విధవాశ్రమంలో ఉంచుతాడు సుమన్ అక్కడికే చేరుకుంది. సుమన్ వెళ్ళిపోయింతర్వాత ఆమె భర్త పశ్చాత్తాప పడ్డాడు. సుమన్‌కు అక్కడా స్థానం లభించదు. గంగలో దూకడానికి వెళ్తుంటే గిజాధరుడు రక్షిస్తాడు ఆమె సేవాశ్రమానికి తన జీవితం అంకితం చేస్తుంది.

ప్రేమాశ్రమ్ జమీందార్ల దౌర్జన్యాలను చిత్రించే నవల. ఇందులో అమె రికా నుంచి తిరిగివచ్చి అక్కడి విధానాల ఆచరణకు పూనుకున్న ప్రేమశంకర్, రష్యా విప్లవంతో ప్రభావితుడైన బాలరాజ్ ఉద్యమ నిర్మాణంలో దర్శనం ఇస్తారు.

జ్ఞానశంకర్ స్వార్థపూరితుడయిన జమీందారు. అతడు ప్రజలను అనేక రకాల పీడిస్తాడు. ప్రేమ్‌శంకర్ అతని తమ్ముడే అయినా ఉదారవాది. ప్రజా సేవకుడు.

బాలరాజ్ తల్లిని జమీందారు ఏజంట్లు కింద పడేసి కొడ్తారు. ఆ ఏజెం టును బాల్‌రాజ్ తండ్రి హత్య చేస్తాడు. ఆ నేరం మీద బాలరాజ్ అతని తండ్రి మనోహర్‌ను జైలుకు పంపుతారు. జమీందారు దౌర్జన్యాలు మితిమీర్తాయి. మనోహర్ జైల్లో ఆత్మహత్య చేసుకొంటాడు ప్రేమశంకర్ ప్రయత్నం వల్ల మిగతావాళ్ళు విడుదల అవుతారు.

ప్రేమశంకర్ ప్రేమాశ్రమం ప్రారంభించి గ్రామాన్ని ఆదర్శ గ్రామంగా చేస్తాడు. జమీందారీ తొలగిపోయిన గ్రామంలో స్వేచ్ఛా సంపదలు వెల్లివిరు స్తాయి.

కాయకల్ప ఒక జన్మజన్మల కథ. ఇందులో ప్రేమ్‌చంద్ అంతగా కని పించరు. ఏదో అయోమయపు రచనలా కనిపిస్తుంది

జగదేశపురపు రాణి విధవ. ఒకనాడు ఒక రాజకుమారుడు వస్తాడు. పూర్వజన్మలో తానే ఆమెకు భర్తను అంటాడు. ఆమె అంగీకరిస్తుంది. ఇలాంటి అభూత కల్పనలే కాయకల్ప. అయితే ఇందులోనూ జమీందార్ల దౌర్జన్యాలూ, చక్రధర్ జరిపిన అహింసాయుత పోరాటాలూ ఉన్నాయి.

ప్రేమ్‌చంద్ రచలన్నింటిలో "కాయకల్ప" నీరసం అయిన రచన. "ఇదొక బాణామతిలాంటిదిఅంటే అతిశయోక్తికాదు" అంటారు మన్మధనాథగుప్త.

రంగ భూమి ప్రేమ్‌చంద్ నవలల్లో విశిష్టం అయింది. కూలిపోతున్న భూస్వామ్య నాగరకత, ఉదయిస్తున్న పారిశ్రామిక నాగరికతను గురించిన చర్చ ఇందులో ఉంది. పాత విలువలు కూలిపోకుండే, గ్రామ జీవితంలోని ప్రశాంతత దూరంఅయి పారిశ్రామిక విలువలకు సంబంధించిన అత్యాశ అవినీతి చోటు చేసుకుండా ఉంటే బాగుండుననే ఆవేదన ఇందులో కనిపిస్తుంది.

సూర్‌దాస్ గుడ్డివాడు. బిచ్చగాడు. అతనికి పాండేపూర్‌లో కొంత భూమి ఉంది. దాన్లో ఊళ్ళో పశువులు మేస్తుంటాయి. ఆ భూమిని కొని ఒక సిగరెట్టు ఫ్యాక్టరీ స్థాపించాలనుకొంటాడు జాన్‌సేవక్. సూర్‌దాస్ ఆ భూమిని అమ్మడానికి అంగీకరించడు. ఫ్యాక్టరీవస్తే అనేక అనర్థాలు వస్తాయని అతని ఉద్దేశం. జాన్‌సేవక్‌కు వ్యతిరేకంగా సూర్‌దాస్ అహింసాయుత పోరాటం సాగిస్తాడు. ఒక స్త్రీకి ఆశ్రయం ఇచ్చినందుకు అభాండం మోపి సూర్‌దాస్‌ను జైలుకు పంపిస్తారు. తిరిగివచ్చి అతను సత్యాగ్రహం సాగిస్తాడు. ఆ సందర్భంలో అతనికి తుపాకిగుండు తగులుతుంది. సూర్‌దాస్ చనిపోతాడు. అక్కడ పరిశ్రమ నెలకొంటుంది.

ఇందులో సోఫీ, వినయకుమార్‌ల ప్రేమ కథ ఉంది. ఇద్దరూ సూర్‌దాస్‌ను బలపరుస్తారు. రాజకుమారుడై కూడా వినయ్ విప్లవవాదుల్లో చేరి పోరాటం సాగిస్తాడు. అయినా జనం అతన్ని నమ్మరు. వారికి నమ్మకం కలిగించడానికి పిస్తోలుతో కాల్చుకుని చచ్చిపోతాడు. సోఫీ ఆత్మహత్య చేసుకుంటుంది.

గబన్ ఆడంబరాలకు పోయే ఆడవారిని హెచ్చరించే కథ. రామ్‌నాధ్, జాల్పా భార్యాభర్తలు. రామ్‌నాధ్‌కు మున్సిపాలిటీ ఆక్ట్రాయ్‌లో ఉద్యోగం. పై ఆదాయం కూడా ఉంది. భార్య నెక్లెస్ కావాలని సతాయిస్తుంది. అరువందలు అప్పుచేసి నగ చేయిస్తాడు. భార్య స్నేహితురాలు రత్న ఆ నగ చూచి తనకు అలాంటిది చేయించి పెట్టమని డబ్బిస్తుంది. రామ్‌నాధ్ ఆ డబ్బు దుకాణంవాడికి ఇస్తే పాత బాకీ కింద పట్టుకుంటాడు. రత్న వత్తిడికి తట్టుకోలేక మున్సిపాలిటీ డబ్బు ఇచ్చేస్తుంది జాల్పా. రామ్‌నాధ్‌కు ఆ విషయం తెలిసి కలకత్తా పారిపోతాడు. జాల్పా తన నగలు అమ్మి మున్సిపాలిటీ డబ్బు కట్టేస్తుంది. రామ్‌నాధ్‌ను కలకత్తాలో పోలీసులు అనుమానాస్పద పరిస్థితుల్లో పట్టుకొంటారు. రామ్‌నాధ్ భయపడి తాను కాజేసిన డబ్బు విషయం చెప్పలేడు. దర్యాప్తులో

అది నిజంకాదని పోలీసులు తెలుసుకుంటారు. కాని వదిలి పెట్టరు. విప్లవ కారులకు వ్యతిరేకంగా రామ్‌నాధ్‌తో దొంగ సాక్ష్యం చెప్పిస్తారు. విప్లవకారులకు శిక్షపడుతుంది. జాల్నా భర్తను వెదుక్కుంటూ కలకత్తా చేరుకుంటుంది. భర్తచేసిన ద్రోహం తెలుసుకుంటుంది. భర్తను అసహ్యించుకుంటుంది. ఒక విప్లవకారుని వృద్ధమాతకు సేవ చేస్తూ ఉండిపోతుంది. జోహరా అనే వేశ్యవల్ల రామనాధ్‌కు పోలీసులనుండి విముక్తి లభిస్తుంది. అతడు జడ్జి దగ్గరికి వెళ్ళి తాను దొంగ సాక్ష్యం చెప్పానని వెల్లడిస్తాడు. విప్లవకారులు విడుదల అవుతారు.

రామ్‌నాధ్ జాల్నా కలుసుకుంటారు. వారు గంగ ఒడ్డున వ్యవసాయం చేసి జీవిస్తుంటారు. జోహరాకు జ్ఞానోదయం అవుతుంది. ఆమెకూడా వారితో కలిసి వ్యవసాయం చేసి జీవనం గడుపుతుంది.



# నిర్మల

ప్రేమ్‌చంద్ రచించిన నవలలన్నింటిలోనూ "నిర్మల" చిన్న నవల. భారత మహిళల దుస్థితిని వివరించడానికి ప్రేమ్‌చంద్ ఈ నవల రాసినట్లు కనిపిస్తుంది. ఈ నవల "చాంద్"అనే పత్రికలో 1925 నవంబరునుంచి 1926 నవంబరువరకు ధారావాహికగా ప్రచురించబడింది. "చాంద్" మహిళ కోసం వెలువడిన పత్రిక. 'నిర్మల' భారత సంప్రదాయక మహిళకు సజీవ సాక్ష్యం. అప్పటికి అమలులో ఉండిన ఆచారాల క్రూరత్వాన్ని గురించి ఆలోచింపచేసి కన్నీటిచుక్కలు రాలేట్లు చేసిన ఉత్తమనవల నిర్మల. నిర్మల నిర్మలం అయిందే. అయినా ఆమెకు అడుగడుగునా విషబిందువులే లభించాయి కాని ఎక్కడా ఇసుమంత ఆనందం లభించలేదు. ఇది విధికృతమా? స్వయంకృతమా? సమాజకృతమా? ఇందుకు రచయిత సమాధానం చెప్పడు. నవల సొంతం చది విన తరువాత మనకు ఎదురయ్యే సమస్యలు ఇవి. వీటికి మనమే సమాధానాలు వెదుక్కోవాలి.

నిర్మల ఉదయభానులాల్ కూతుళ్ళలో పెద్దది. ఉదయభానులాల్ వకీలు. మరీ లేనివాడేంకాదు. మంచివాడని పేరు సంపాదించుకున్నారు. నిర్మలకు సంబంధం వచ్చింది. కట్నంలేకుండా చేసుకుంటామన్నారు. పెళ్ళి ఘనంగా చేయాలన్నారు. పెళ్ళిఖర్చుల విషయంలో ఉదయభానులాల్‌కూ వారి భార్య కళ్యాణికీ తగాదా వచ్చింది. భార్యకు గుణపాఠం చెప్పడానికి నాలుగు రోజులు ఎటైనా వెళ్లిరావాలని అర్ధరాత్రి బయలుదేరారు.

"ఈజగన్నాటకం సొంతం విధి ఆడిస్తున్నది. అని ఎవరికి తెలుసు? విధి క్రూరం అయింది. అదృశ్యంగా ఉండి జీవనసూత్రాన్ని తన చేతులతో ఆడిస్తుం టుంది. అది అవాస్తవాన్ని వాస్తవం చేస్తుంది. నాటకాన్ని నిజం చేస్తుంది."

ఉదయభానులాల్ గంగవైపు సాగిపోతున్నారు. వారు శిక్షవేయించిన ఒక దుర్మార్గుడు ఎదురయినాడు. దుడ్డుకర్రతో తలబద్దలు చేశాడు. లాల్ ఆడుదా మనుకొన్న నాటకాన్ని విధి నిజం చేసింది.

కళ్యాణి కడవరంకొద్దీ కన్నీరుకార్చినా ప్రయోజనంలేదు. ప్రేమ్‌చంద్ ఆ పని చేయరు. మనిషి పోయాక అతను వీడిపోయిన సమస్యలవైపు సాగి పోతారు.

నిర్మలను చేసుకుంటామన్నవారు మొండిచేయి చూపించారు. పెండ్లి ఏర్పాట్లన్నీ జరిగి ఉన్నాయి. అప్పుడు జరక్కుంటే ఇహ నిర్మల పెండ్లి కాదు. వరులకోసం వెదికింది మంచి సంబంధాలే వెదికితెచ్చాడు బాపడు. వాళ్ళంతా కట్నంమీద ఆశ పెట్టుకున్నారు. కళ్యాణికి కట్నంఇచ్చే శక్తిలేదు. కట్నం లేకుండా చేసుకునే సంబంధం ఒకటి ఉంది. వరుడు తోతారాం, వకీలు. వయసు 35, 40 మధ్యఉంటుంది. ఈ మధ్యనే భార్య పోయింది. "వారి బొర్ర పెద్దది. అజీర్ణం, అరిసెమొలలు వారికి మిత్రులు. అవి వారితో సహజీవనం చేస్తాయి అడుగు పెట్టాలంటే ఆలోచించిగాని పెట్టడు. వారికి ముగ్గురు కొడుకులు. పెద్దవాడు మన్సారామ్. పదహారేళ్ళు. మధ్యవాడు జియారామ్. పన్నెండేళ్ళు. చివరివాడు సియారామ్. ఏడేళ్ళు. ఇంట్లో వకీలుగారి విధవ సోదరి ఉంది పేరు రుక్మిణి."

రత్నంలాంటి తన కూతురును నడి వయసువాడికి కట్టబెట్టడం తల్లికి ఇష్టంలేదు. కాని సమాజంలో ఉన్న దురాచారం కట్నం. తాను కట్నం ఇచ్చుకో లేదు. నిర్మల పెళ్ళి విరమించుకోలేదు. చూస్తూ చూస్తూ కూతురును నూతిలో తోయడానికి సిద్ధపడిపోయింది కళ్యాణి. వరకట్నం అనే దురాచారం తల్లిని రాక్షసిని చేసింది. మిసమిసలాడే వయసులో ఉన్న నిర్మలను ముసలివాని కొంపకు తోసింది.

నిర్మల తోతారాం ఇంటికి వచ్చింది. సంపద నిర్మముందు మోకరిల్లింది. అయితే సంపదున్నంత మాత్రంతో ఎవరికీ ఆనందం లభించదు. "నిర్మల రత్నాలు పొదిగిన విశాల భవనం. తోతారామ్ కూలి కుప్పబడనున్న కొంప." ఇద్దరికీ దాంపత్యం. నిర్మలను సంతోషపెట్టాలని తోతారామ్ ఆవేశం. తన ధనం సొంతం ఆమెకు అప్పగించాడు. నగలు తెచ్చి ఇచ్చి సంతోషపెట్టాలను కునేవాడు. కాని ఎంతవెదికినా ఆమెలో ఆనందం కనిపించేదికాదు.

ఒకనాడు నిర్మల ప్రసన్నంగా కనిపించింది. తెరవేసిఉండిన నిలువు టద్దం తెర తొలగింది. వకీలుగారికి ఆనందం కలగలేదు. అనుమానం కలిగింది. నిర్మల నిర్మలమనస్కురాలు. పెద్దకొడుకు మన్సారామ్ తనకు ఇంగ్లీషు చెప్పు

తున్నాడు అన్నది. ముసలివానికి అనుమానం పిశాచంలా పట్టింది. గాలి తిరుగుళ్ళు తిరుగుతున్నాడని కొడుకును తిట్టాడు. హాస్టల్లో ఉంచుతానన్నాడు. నిర్మల గ్రహించింది కాని కుర్రాడు గ్రహించలేకపోయాడు ఇంటినుంచి కదల లేదు. గదిలోనే ఉండిపోయాడు. నిర్మల మన్సారామ్‌తో మాట్లాడటం మానేసింది.

ఒకనాడు భోజనానికి రానని భీష్మించాడు మన్సారామ్. తల్లిగా కొడుకును బ్రతిమిలాడాలని వెళ్ళింది నిర్మల. మన్సారామ్ బుజ్జగిస్తుండగా వకీలు గారు వచ్చేశారు. నిర్మల అవతారం మార్చేసింది. ''మన్సారామ్‌కు టెక్కు పెరిగింది. రమ్మంటే భోజనానికి రాడు. నేనేమీ చేయలేను, మీ ఇష్టం. మీ కొడుకు ఇష్టం'' అని రుసరుసా వెళ్ళిపోయింది.

మన్సారామ్ గ్రహించాడు. మకాం హాస్టలుకు మార్చాడు. అక్కడ అతనికి జ్వరం వచ్చింది. హాస్టలువాళ్ళు తీసికెళ్ళమన్నారు. ఇంటికి తీసుకు రావడం వకీలుగారికి ఇష్టంలేదు. ఆస్పత్రిలో చేర్చారు. నిర్మలను అక్కడికి రావద్దని నిషేధం విధించారు. మన్సారామ్‌కు విషమించిందని తెలిసి నిర్మల కాలు నిలువలేదు. ఆస్పత్రికి ఉరికింది. మన్సారామ్ అంత జ్వరంలోనూ ఆవేశంతో లేచి నిర్మల కాళ్ళమీద పడి కన్నీటితో ఆమె కాళ్ళు కడిగి ''మా అమ్మ వేరు నువ్వు వేరు కాదమ్మా!'' అన్నాడు. ముసలివాని అనుమానం దూరం అయింది కాని కొడుకు కూడా దూరం అయిపోయాడు. మన్సారామ్ చనిపోయాడు.

వకీలుగారికి మనస్తాపం ఎక్కువయింది. సంపాదన ఆగిపోయింది. ఇల్లు వేలం అయింది. నిర్మలకు ఒక కూతురు కలిగింది. మన్సారామ్‌కు చికిత్స చేసిన డాక్టరుతో పరిచయం ఏర్పడింది వకీలుగారికి. డాక్టరు భార్య సుధతో నిర్మలకు పరిచయం ఏర్పడింది. నిర్మల తొలిపెండ్లి ఎత్తిపోవడానికి సంబంధించిన కథ విన్నది సుధ. డాక్టర్ను బాగా చీవాట్లు పెట్టింది. అతనే నిర్మలకు కావలసి ఉండిన భర్త. డాక్టరు పశ్చాత్తాపడి తన తమ్మునికి నిర్మల చెల్లెలి సంబంధం కుదిరించాడు. నిర్మల చెల్లి పెళ్ళికని పుట్టింటికి వెళ్ళింది.

ఇక్కడ అత్తింట్లో రెండో కొడుకు జియారామ్ దుడుకువాడయి పోయాడు. తండ్రికి తిరగబడుతున్నాడు. అన్న చావుకు కారణం తండ్రేనని ప్రచారం చేస్తున్నాడు. నిర్మల తిరిగి వచ్చింది. అర్ధరాత్రి జియారామ్ నిర్మల గదిలో ప్రవేశించి నగల పెట్టె ఎత్తుకుపోయాడు. నిర్మల చూసింది. అయినా జియారామ్ మీద భర్తకు చెప్పలేదు. భర్త అసలే అనుమానం మనిషి! వకీలు పోలీసుకు రిపోర్టు ఇచ్చారు. నిర్మల వారిస్తున్నా వినలేదు.

సొమ్ము దొరికింది. దొంగిలించిందెవరో పోలీసులకు తెలిసిపోయింది. వకీలు గారు కుంగిపోయారు. లంచం ఇచ్చి విడిపింతామన్నా డబ్బులేదని వాపో యాడు నిర్మల తన దగ్గరి డబ్బు ఇచ్చింది. లంచం ఇచ్చి కొడుకు ప్రమే యం లేకుండా చూచి వచ్చారు. ఇంటికి వచ్చేవరకు డాక్టరు వచ్చి జియారామ్ ప్రాణం తీసుకున్నాడని చెప్పాడు. నిర్మల ప్రాణాలు పైపైనే లేచిపోయాయి. వకీలుగారు కూలబడ్డారు.

తరవాత నిర్మల జరిగిదంతా వివరించింది. ''తల్లి అయితే ఇలా ఊరు కునేదా ?'' అని అడిగాడు వకీలు. ''అప్పుడే చెప్పి ఉంటే మీరు అనుమాన పడకపోయేవారా?'' అడిగింది నిర్మల.

జియారామ్ చావుకు కారణం ఎవరు ?

పరిస్థితులు మరీ దిగజారాయి. వకీలుగారు నిర్మలకు ఆత్మార్పణం చేసు కున్నారు. నిర్మల ఆర్థికంగా కఠినాతికఠినురాలయింది. కూతురుకోసం కూడ బెట్టాలని ఆమె తపన. సియారామ్ చదువు సాగడం లేదు. ఒకనాడు నెయ్యి తెమ్మని పంపింది. తాను వెళ్ళనన్నాడు. అయినా వెళ్ళాడు. తెచ్చాడు. నేయి బావుండలేదు. వాపసియ్యమంది. సియారామ్ తలకొట్టినంత పనయింది. అయినా వెళ్ళాడు. సావుకారుతో తగాదా పడ్డాడు. అది మార్చి మంచి నేయి తెచ్చాడు. నిర్మలకు సంతృప్తి కలగలేదు. అయినా ఏమీ అనలేదు. కట్టెపుల్లలు తెచ్చిపెట్ట మంది. రెచ్చిపోయాడు సియారామ్. తేనని వెళ్ళిపోయాడు. పొయ్యిలో పిల్లి లేవలేదు. సాయంత్రం వకీలుగారు వచ్చారు. అంతా తెలుసుకున్నారు. నిర్మల వల్లనే తన సంసారంలో చిచ్చురేగిందని నానా దుర్భాషలాడాడు. అర్ధరాత్రి దాకా సియారామ్ రాలేదు. తెల్లవారి రాలేదు. కొడుకును వెదకడానికి పెట్టె పక్కచుట్టా కట్టుకొని తోతారామ్ ఇల్లు వదిలి వెళ్ళిపోయారు.

సియారామ్ వెళ్ళిపోవడానికి కారణం ఆర్థికమా ?

నిర్మలకు కారడవిలో, కార్చిచ్చులో దూరినట్లుంది. ఒకనాడు సుధ ఇంటికి వెళ్ళింది. ఆమె లేదు. డాక్టరు నిర్మల చేయి పట్టబోయాడు ఏడుస్తూ ఇంట్లోంచి వస్తున్న నిర్మలను సుధ చూచింది. నిర్మలను అడిగింది. ఆమె ఏడ్చింది. కాని ఏమీ చెప్పలేదు. ఇంట్లోకి వెళ్ళింది సుధ భర్తమీద అనుమానం కలిగింది. నిర్మలమీద భర్తకు మొదటనుంచీ కన్ను ఉందని తట్టింది. తెల్లవారి డాక్టరు ఆత్మహత్య చేసుకున్నాడు.

నిర్మల కుంగింది. కృశించింది కూతురును రుక్మిణికి అప్పగించింది. కన్ను మూసింది. దహన సంస్కారం ఎవరు చేయాలి ? అని ఆలోచిస్తున్న ప్పుడు ప్రాణంలేని ప్రతిమలా తోతారామ్ వచ్చాడు.

ఇదీ నిర్మల కథాంశం. ఇహ ఆలోచించండి.

# కర్మ భూమి

ప్రేమ్‌చంద్ నవలల్లో "కర్మభూమి" కి ప్రత్యేకమైన స్థానం ఉంది. కర్మభూమి చైతన్యానికి ప్రతీక. భారతజాతి చైతన్య జ్వాల ఈ నవలలో అడుగడుగునా కనిపిస్తూంది. కర్మభూమి ఏ ప్రాంతానికి చెందిన నవలకాదు. ఇది భారతజాతి స్వాతంత్ర్య కాంక్షకు దర్పణం. ఆనాటికి భారతదేశంలో ప్రజ్వరిల్లుతుండిన స్వాతంత్ర్య జ్వాలకు ప్రభావితుడయి ప్రేమ్‌చంద్ ఈ నవల రాశాడనిపిస్తుంది.

ఆనాడు భారతదేశం యావత్తు తెల్లదొరతనం మీద తిరుగుబాటు లేవదీసింది. భగత్‌సింగ్ శాసన సభలో బాంబులు వేశాడు. భగత్‌సింగ్, రాజగురు, సుఖదేవ్ ఉరికంబాలకు ఎక్కారు. కాంగ్రెస్ సైమన్ కన్ కమిషన్ను బహిష్కరించింది. లాలా లజపత్‌రాయ్ పోలీసు లాఠీ దెబ్బలకు అమరుడయినాడు. లాహోర్ కాంగ్రెస్ సభలకు యువ నాయకత్వం వచ్చింది. జవహర్‌లాల్ నెహ్రూ అధ్యక్షత వహించారు. వారి అధ్యక్షోపన్యాసంలో తనను సోషలిస్టుగా ప్రకటించుకున్నారు. తెల్లదొరల సామ్రాజ్య భవనపు పునాదులు కదిలిపోతున్నాయి. ఆసేతుహిమాచలం భారతదేశంలో విప్లవజ్వాల రగిలింది.

"కర్మ భూమి" లో ఈ చైతన్య స్రవంతి, విప్లవ జ్వాలలు దర్శనం ఇస్తాయి. ఈ విప్లవం ఏ కొండలోనో, కోనలోనూ అవతరించి ది కాదు. ఇది ప్రజల హృదయాల్లో రగిలిన క్రాంతిజ్వాల. అంతరాలతో సంబంధంలేక ప్రజానీకం యావత్తూ ఈ సమరంలో దూకారు. పల్లెలు, పట్నాలు, అడవులు, కొండప్రాంతాలు సర్వప్రదేశాలలో వచ్చిన జాగృతి ఈ నవలలో మనకు దర్శనం ఇస్తుంది. అన్యాయం. అక్రమం, దౌర్జన్యం వీటిని ఎదుర్కోవడానికి ఈ నవలలోని పాత్రలు చేసిన పోరాటం స్వచ్ఛం అయింది. నిస్వార్థం అయింది. దేశభక్తిపూరితం అయింది.

"ఒకరు పది రూపాయల్లో గడుపుకుంటారు మరొకరికి పదివేలు ఎందుకు? ఈ నాటకం ఎంతకాలం సాగుతుంది? ప్రజల్లో చైతన్యం రానంత కాలం సాగుతుంది. ఇది న్యాయం కాదు. ధర్మం కాదు. పట్టి నాటకం. ప్రజలు

చైతన్యవంతులు అవుతున్నారు. ఈ నాటకం ఎంతోకాలం సాగదు'' అంటాడు అమర్‌కాంత్-ఈ నవలకు నాయకుడు.

ప్రేమ్‌చంద్ 1931 ఏప్రిల్ 31 నాడు కర్మభూమి రాయడం ప్రారంభించారు. 1932 ఆగస్టులో ఈ నవల అచ్చయింది. పదిహేను నెలలలో ఇంత నవల రాశారంటే వారెంత శ్రమించారో, ఎంత ఉద్యమించారో అర్థం అవుతుంది. భారతయుద్ధంలాంటి ఈ మహాసంగ్రామాన్ని చిత్రించడానికి వారు చేసిన శ్రమకు భారతదేశం వారిని గుర్తించలేదు. వారు గతించిన తరువాత వారికి బ్రహ్మరథం పడుతున్నారు. వారు జీవించి ఉండగా ఆర్థిక దుస్థితితో అలమటించారు. వారు పోయింతరవాత వారి రచనలు బంగారు గనులు అయినాయి. ఇది మన సంప్రదాయం. ప్రాణం ఉన్నదేదీ మనకు పనికిరాదు. ప్రాణరహితం అయిన దానిలో పరమాత్ముడు కనిపిస్తాడు!

ఈ నవలలో పాత్రలను మలచడంలో ప్రేమ్‌చంద్ అసాధారణం అయిన ప్రతిభను కనబరిచారు. ''గోదాన్''లో ఒక్క 'హోరి' ఉన్నాడు ''రంగభూమి''లో ఒక్క సూర్‌దాస్ ఉన్నాడు. ''కర్మభూమి''లో అన్ని పాత్రలూ తేజోమూర్తులే. పాషండుడయిన సమరకాంత్ సహితం ఈ సమరానికి యోధుడు కావడం విశేషం. ఒక్క మనీరామ్ తప్ప అందరూ స్వాతంత్ర్యసమరానికి అంకితం అయిన యోధులే. ఒక్క అమర్‌కాంత్ తప్ప వీరిలో ఎవరూ ఆదర్శాలజోలికి పోయినవారు కారు. అందరూ సామాన్యం అయిన జీవితాలు గడుపుకుంటున్నవారే. పరిస్థితుల ప్రభావం వారందరినీ సమరాంగణంలోకి నెట్టింది. ఏ ఒక్కడూ విప్లవ మూర్తిగా జన్మించడు. పరిస్థితుల ప్రభావం వల్ల అనేక మంది జ్యోతిర్మూర్తులు అవతరిస్తారు అని చెప్పడం ప్రేమ్‌చంద్ ఉద్దేశం అయి ఉండాలి.

సంఘటనలను సృష్టించడంలో కూడా రచయిత ఎంతో ప్రతిభను ప్రదర్శించారు. ఆ పరిస్థితుల్లో మనం ఉన్నా అట్లాగే చేసి ఉండే వాళ్ళం అనిపిస్తుంది. సలీమ్ ప్రభుత్వ అధికారి. ప్రజా ఉద్యమాన్ని అణచడానికి రక్తం ప్రవహింప చేసిన పాషాణ హృదయుడు. రాతిగుండె వాడయిన లాలా సమర్‌కాంత్ కొండ ప్రాంతాల్లో ప్రజల తిరుగుబాటును అణచడానికి సలీమ్ చేస్తున్న దౌర్జన్యాన్ని చూస్తాడు. లాలాలో మానవ హృదయ స్పందన కలుగుతుంది. సలీమ్‌తో వాదిస్తాడు. తిండిలేని వారు పన్నులు ఎలా కడ్తారు? అన్నం అడుగుతే

తుపాకీ గుండ్ల వర్షం కురిపిస్తారా ? అని అడుగుతాడు. సలీమ్ మారిపోతాడు. అతడు పదవికి రాజీనామా ఇస్తూ అన్న మాటలు నిత్య సత్యాలు.

"ప్రజలకోసం ప్రభుత్వం ఉంది. ప్రభుత్వంకోసం ప్రజలు కారు. రైతుల మీద దౌర్జన్యం చేసి వారిని తుపాకి గుళ్ళకు బలిచేసే ప్రభుత్వంలో నేను భాగస్వామిని కాలేను. రాబడిలో తక్కువ అయితే ప్రభుత్వం ఖర్చు తగ్గించు కోవాలి. అంతేగాని ప్రజల మీద దౌర్జన్యం జరుపరాదు."

ప్రేమ్‌చంద్‌కు పాత్రల విషయంలో వివక్షణ లేదు. ఎంత అల్పమైన పాత్రనైనా అనల్పంగా చిత్రిస్తాడు. సకీనా పఠానిన్ వాస్తవంగా అల్పమైన పాత్రలు. వాటితో అనల్పమైన త్యాగాలు చేయిస్తాడు. తిండికి లేని సకీనాను ప్రేమమూర్తిగా చిత్రిస్తాడు. సకీనా, అమర్‌కాంత్‌ల ప్రేమ ద్వారా హిందూ ముస్లిముల అయిక్యత చూపించడానికి ప్రయత్నించాడు. కాని వారికి వివాహం చేయలేదు. ఉద్యమ ప్రభావం వల్ల సుఖదలో, అమర్‌కాంత్ ఆశించిన ప్రేమ జ్యోతి వెలుగుతుంది. భార్యాభర్తల్లో ఉన్న అంతరాలు దూరం అవుతాయి. సలీమ్ సకీనాల పెళ్ళి అవుతుంది.

ప్రేమ్‌చంద్ సృష్టించిన అల్పం అయిన గొప్ప పాత్ర మున్నీది. మున్నీ పల్లెపిల్ల. ఇంగ్లీషు జవానులు ఆవచేలో ఆమెను చెరిచారు. పల్లెవాళ్లు బెదిరి పారిపోయారు. ఆటునుంచి వస్తున్న అమర్‌కాంత్, శాంతకుమార్ ఇంగ్లీషు వాళ్ళతో తలపడ్డారు. శాంతకుమార్‌కు తుపాకి గుండు తగిలి గాయం అయింది. వెళ్ళిపోయారు.

మున్నీ శీలం దొంగిలించారుదుర్మార్గులు. ఆమె పగ బట్టింది. ఊరికిపోలేదు. బనారస్ వచ్చింది. బజార్లో కనిపించిన ఇద్దరు తెల్లవాళ్ళను పొడిచి చంపింది. పోలీసులకు పట్టుబడింది. కోర్టులో ఈ కేసు విషయంలో జరిగిన విచారణ కాశీని కదలించి వేసింది. అమర్‌కాంత్ నాయకత్వం స్థిరపడడానికి కారణం ఆ కేసే. జడ్జి ఒకవేళ మున్నీకి శిక్షవేస్తే జడ్జిని హత్య చేయడానికి కూడా ఏర్పాట్లు జరిగాయి. మున్నీ నగరానికి దేవత అయిపోయింది. నగరం ఆమెకు బ్రహ్మరథం పట్టడానికి సిద్ధం అయింది. జడ్జి ఆమెను నిర్దోషిగా ప్రకటిస్తాడు. మున్నీ ఎలాంటి సన్మానాలకూ అంగీకరించదు. ఒంటరిగా రైలు స్టేషనుకు వెళ్ళి హరిద్వార్ నుంచి కొండపల్లెను వెళ్లిపోతుంది. అమర్‌కాంత్ ధనరాసులను వదిలి పల్లెపట్టుల సేవ చేయడానికి ఆ గ్రామానికే చేరుకుంటాడు.

అక్కడ జరిగిన తెలంగాణ పోరాటానికి నాయకత్వం వహించి, ఇద్దరూ జేలు పాలు అవుతారు.

లాలా సమర్‌కాంత్ ధనికులు. వర్తకులు. నగరంలో పేరు ప్రఖ్యాతులు ఉన్నవారు. వారి ఏకైక పుత్రుడు అమర్‌కాంత్. అమర్ చిన్నతనం నుంచే ఆదర్శాలు అలవరచుకున్నాడు. దేశంలో అధిక భాగం జనం అన్నానికి అలమటిస్తుంటే తాను భోగభాగ్యాలు అనుభవించనని దీక్ష పూనాడు. అమర్ గాంధీవాది. మహా సౌధంలో సైతం నేలమీద పడుకుంటాడు. రాట్నం వడుకుతాడు. అమర్‌లో ప్రేమ్‌చంద్ ఆశావాదం కనిపిస్తుంది. వాస్తవానికి అమర్‌లో ప్రేమ్‌చంద్ కనిపిస్తాడు. ప్రేమ్‌చంద్‌వలెనే అమర్ కూడా మాతృప్రేమ ఎరుగనివాడు. అమర్‌కు పెళ్ళి అయింది. భార్య సుఖద. ఆమె సంపన్నుల ఇంటి బిడ్డ. ఆమె సుఖాలు కోరుకునేది. ఇతడు కష్టాలు కోరుకునేవాడు. వీరి దాంపత్యం నీరు ఇసుకు కలిసినట్లుంది అంటాడు ప్రేమ్‌చంద్.

అమర్‌కు ప్రజాసేవ అలవడింది. ఇతడు వ్యాపారం చేయడం లేదని తండ్రి కోపం. ఇంట్లో ఎవరూ అతనితో మనసు కలిసినవారు లేరు. ఇలా ఉండగా మున్నీ కేసు వచ్చింది. "ఆమెకు శిక్షపడొచ్చు. పడకపోవచ్చు. కాని భారతదేశపు దరిద్రులైన స్త్రీలు సైతం తమ శీల రక్షణకు ఎంతటి త్యాగాలు చేయగలరో విదితం అయింది'' అంటాడు. ఆ కేసులో అతడు రాత్రింబవళ్లు పని చేశాడు. ప్రజాభిమానం చూరగొన్నాడు. మున్సిపల్ బోర్డు మెంబర్ అయినాడు. తండ్రితో మనస్పర్థలు వచ్చాయి. విడిపోయాడు. సుఖద కూడా వెంట వచ్చింది. ఖద్దరు బట్టలు మూట నెత్తిన పెట్టుకుని అమ్మాడు. సకీనాతో ఇదివరకే పరిచయం ఉంది తన ఇంట్లో ఎవరినుంచీ లభించని ప్రేమామృతం సకీనాలో కనిపించింది. సకీనాను పెళ్ళి చేసుకుంటానన్నాడు. ఇటు తండ్రి, అటు సకీనా అమ్మమ్మ పఠానిన్ నుంచీ వ్యతిరేకత వచ్చింది.

అమర్ బనారస్-వదిలాడు. పల్లెప్రజల సేవ చేయడానికి బయలుదేరాడు. ఎన్నో గ్రామాలు తిరిగాడు. ఎందరో అతనికి మిత్రులయినారు. "నగరపు సుకుమార యువకుడు చిక్కిపోయాడు కాని ఎండ వడగాడ్పు, తుఫాను-వర్షం, ఆకలి దప్పి వీటిని సహించే శక్తి సంతరించుకున్నాడు.'' అతడు ఒక కొండ గ్రామానికి చేరాడు. అక్కడ మున్నీ కలిసింది. వాళ్ళకు చదువు చెప్పాడు. హింస మాన్పించాడు. వారి తలలో నాలుక అయినాడు. ఆ ప్రాంతంలో కరువు

వచ్చింది. సలీమ్ అమర్‌కు బాల్య స్నేహితుడు. ఆ ప్రాంతానికి అధికారిగా వచ్చాడు. అతన్ని కలిశాడు. ప్రజలకు మేలు చేయాలనుకున్నాడు. కాని సలీం రాక్షసుడు అయినాడు. మిత్రునిగా గ్రామానికి వచ్చి అమర్‌ను అరెస్టు చేశాడు. ఊరువాడ సాంతం తిరగబడింది. అమర్ అందరినీ శాంతింపజేసి జేలుకు వెళ్ళిపోయాడు. లాలా సమర్‌కాంత్ కొడుకును చూడ్డానికి కొండ గ్రామానికి వచ్చాడు. మున్నీ వలన అక్కడి దౌర్జన్యం విన్నాడు. సలీమ్ దౌర్జన్యాన్ని ఎదిరించడానికి ఉరికాడు. సలీమ్ తన గుర్రాన్ని లాలా మీదికే ఉరికించాడు. కొట్టడానికి కొరడా ఎత్తాడు. లాలాను చూచి ప్రతిమగా మారిపోయాడు. లాలా సలీమ్‌ను నానా చీవాట్లు పెట్టాడు. సలీమ్ మారాడు. రాజీనామా ఇచ్చాడు. సలీమ్ అరెస్టయినాడు అమర్ ఉన్న జేలుకే చేరుకున్నాడు. మున్నీ కూడా జేలుకు చేరుకుంది.

అక్కడ నగరంలో లాలాజీ కొండప్రాంతానికి రాకముందు ఏం జరిగిందంటే. అమర్ వెళ్ళిపోవడంతో లాలాకు ధర్మబుద్ధి ఎక్కువయింది గుళ్ళో పురాణం చెప్పించాడు. పురాణం వినడానికి ఒక హరిజనుడు వచ్చాడు. గుళ్ళోని పెద్దమనుషులంతా అతన్ని తరిమేశారు. తెల్లవారి పెద్ద ఉద్యమం లేచింది గుంపులు గుంపులుగా జనం గుడిముందు చేరారు. పోలీసులు కాల్పులు జరిపారు సుఖద చూస్తూ ఊరుకోలేకపోయింది. తుపాకి గుండుకు రొమ్ము ఇచ్చి నుంచుంది. ప్రజలు ఆమెను దేవతగా భావించారు అమర్ చేయాల్సిన నాయకత్వం సుఖదకు వచ్చింది. కాల్పులకు వ్యతిరేకంగా నగరంలో హర్తాళ్ చేయించింది. చాకళ్ళు, మంగళ్ళు, పాకీవారు, హరిజనులు అంతా సమ్మె చేశారు. సుఖదను అరెస్టు చేయడానికి లాలాజీ ఇంటికి పోలీసులు వచ్చారు. లాలాజీ జమానతు ఇస్తానన్నారు. సుఖద అరెస్టయింది. ఆమెను తీసికెళ్తున్న వ్యాను వెంట నగరం సాంతం కదిలింది. సుఖద జేలుకు వెళ్ళింది. లాలాజీలో మార్పు వచ్చింది. కొండగ్రామానికి వెళ్ళి వచ్చారు.

నగరంలో పేదలకు ఇళ్లు కట్టడానికి స్థలం ఇవ్వాల్సిందని సుఖదా ఆధ్వర్యాన మున్సిపాలిటీని అడగడం జరిగింది. అందుకోసం నగరంలో సమ్మె జరిగింది. ఊరేగింపులు ఉపన్యాసాలు. ఈ ఉద్యమంలో పఠానిక, రేణుక, శాంతకుమార్ అరెస్టయినారు. లాలా సమర్‌కాంత్ సభలో ఉపన్యసించాడు. ఒకనాడో, రెండు నాళ్లో సమ్మె చేయడం కాదు. అధికార్లు మన మాట వినేవరకూ సమ్మె చేయండి. మనం పేదలం. దిక్కులేని వాళ్లం దుఃఖ జీవులం. ఈ పేదలే కొందరిని గొప్ప వారిగా చేశారు ఈ విశాల భవనాలు నిర్మించిందెవరు? విల్లులు నడిపి చేదెవరు? ప్రతి నిత్యమూ గొప్ప వాళ్లకు పాలు, వెన్న అందించేదెవరు?

ఊడ్చేది ఎవరు? ఉతికేది ఎవరు ? ఒక్కవంతు జనపు లాభాలకోసం మూడు వంతుల జనం తమ రక్తం ధారపోస్తున్నారు.......'' లాలాజీ కూడా అరెస్టయి నారు.

లాలాజీ అరెస్టయినాడు వేదిక రిక్తంగా ఉంది. జనంలో కల్లోలం చెల రేగుతూంది. నైనా వేదిక ఎక్కింది.

''మిత్రులారా! నేను లాలా సమర్‌కాంత్ కూతురును. ధనీరాం కోడల్ను. మనీరాం భార్యను. మా తండ్రి, అన్న, వదిన, రేణుక అత్తగారు అంతా జేలు పాలయ్యారు ఈ ఉద్యమం ఆగడానికి లేదు. పదండి మున్సిపాలిటీకి'' అని జండా అందుకొని బయలుదేరింది. జనప్రవాహం ఆమెవెంట కదిలింది.

నైనా భర్త మనీరాంకు అది అవమానం అనిపించింది. ఎదురుగా వచ్చి, పిస్తోలుతో ఆమెను కాల్చేశాడు. జనం రెచ్చిపోయారు. మున్సిపల్ బోర్డు పేద లకు స్థలాలు మంజూరు చేసింది. ప్రభుత్వం జేల్లో ఉన్న అమర్‌తో రాజీకి వచ్చింది. కిస్తులో కొంత మాఫీ ఇవ్వడానికి అంగీకరించింది.

అంతా విడుదలయినారు.

''కర్మభూమి''ని గురించి ఒక విమర్శ ఉంది. ఇందులో ఆదర్శవాదం ఎక్కువగా ఉంది. ''కోరా ఆదర్శవాద్ ఖియారీ పులావ్‌హై'' ''వట్టి ఆదర్శ వాదం కలలోని మృష్టాన్నంలాంటిది.'' ''జీవితంలోని యదార్థాలు ఆదర్శాల కంటె ఏమాత్రం తీసిపోవు'' అంటాడు ప్రేమ్‌చంద్ కర్మ భూమిలోనే. ప్రేమ్ చంద్ స్వయంగా తాను ఆదర్శవాదినని కుంగిపోయాడు చివరి రోజుల్లో. వారు చనిపోయేనాటి ముందటి రాత్రికూడా జైనేంద్రతో ''ఆదర్శవాదం వల్ల ప్రయో జనంలేదు'' అన్నారు.

కర్మభూమిలో ఆదర్శం కంటే వాస్తవమే అధికమేమో అని నాఅభి ప్రాయం. 1980 లో త్యాగానికి అర్థంలేదు. 1947 తరువాతనే దాని అర్థం మారిపోయింది. ఇవ్వాళ్టిదృక్కోణంతో ఆనాటిని పరిశీలించడం న్యాయంకాదు.

1930 లో త్యాగధనులకు కొదువ లేదు. మోతీలాల్, జవాహర్‌లాల్, వల్లభాయి పటేల్ రాజేంద్రప్రసాద్, సుభాస్, ప్రకాశం, రాజాజీ లాంటివాళ్ల తమ ఆస్తులను, ఉద్యోగాలను, వృత్తులను లెక్క చేయక ప్రాణాలను పణంగా పెట్టి రణరంగంలోకి దూకిన రోజులను చూచాడు ప్రేమ్‌చంద్. ఆ వాస్తవాన్నే చిత్రించాడు లాలా సమర్‌కాంత్, సలీమ్ ఆకోవకు చెందిన వాళ్లు ప్రేమ్‌చంద్ వాస్తవాన్నే ఆదర్శంగా చిత్రించాడని నా ఉద్దేశం. రచయిత ఒక ఆదర్శ సమా జాన్ని దర్శించడం తప్పుకాదు. అందరూ హరిశ్చంద్రులు కాలేరు. అందరూ ధర్మ రాజులు కాలేరు. కావాలనుకున్నాడు వ్యాసుడు. తప్పా?

# "గోదాన్"

ప్రేమ్‌చంద్ సామాజిక రచయిత. వారు వ్యక్తిగత జీవితానికి అంతగా ప్రాధాన్యం ఇవ్వలేదు. వారి రచనలలో మనకు వ్యక్తులే కనిపిస్తారు. అయితే వారు సమాజానికి ప్రాతినిధ్యం వహిస్తారు. సమాజంలో ఏదో ఒక వర్గానికి ప్రతీకలుగా ఉంటారు ఆ పాత్రల్లో ఉన్న బలమూ, బలహీనతా మనకు సమాజంలో కనిపిస్తాయి. వారు సమాజ జీవనాన్ని వ్యాఖ్యానిస్తారు. పరిశీలిస్తారు. చిత్రిస్తారు. మనను ఆలోచింపచేస్తారు.

సమాజం సజీవం అయింది. అది స్థాణువులా ఉండదు. మార్పు జీవిత సహజం. మారుతున్న సమాజంతో ఆలోచనా విధానం కూడా మారుతుంటుంది. ఒకే ఆలోచనా విధానపు సంకెళ్లు వేసుకున్న రచయిత కాదు ప్రేమ్‌చంద్. సమాజంలోని పరిణామాలతోపాటు వారి ఆలోచనా విధానంలోనూ మార్పులు వచ్చాయి.

ప్రేమ్‌చంద్ జీవించిన కాలం భారత చరిత్రలో అతి ప్రధానం అయింది. మన సమాజం ఒక ఆలోచనా విధానం రూపొందించుకోవడానికి తపిస్తున్న కాలం. అది ఒక సంధియుగం. ఆలోచనా స్వాతంత్ర్యం కోసం ఆరాటపడుతున్న కాలం అది. అది ఉజ్వలయుగం. ప్రభావాత్మకదశ. ఈ దశలో ఆలోచనా విధానాన్ని ప్రభావితం చేయగల ముగ్గురు రచయితలు అవతరించారు.

రవీంద్రుడు భారతీయ తత్వాన్ని అధ్యయనం చేసి ఆ తత్వాన్ని కళాత్మకంగా చిత్రించిన గొప్ప కళాతపస్వి. అతడు గొప్ప తాత్వికుడు. అతని తాత్విక ఆలోచన అనేక మందిని ప్రభావితం చేసింది. అయితే వారు ఆలోచనా పరులను ప్రభావితం చేశారు. అతడు సౌందర్యోపాసకుడు గద్యంలోనూ కవిత్వంలోనూ మహా రచనలు చేసి మకుటం ఆర్జించుకున్న కవిచక్రవర్తి.

మధ్యతరగతి స్త్రీల జీవితాన్ని అతి సున్నితంగానూ, విషాద భరితంగానూ చిత్రించిన రచయిత శరత్‌చంద్రుడు. అతడు అటు ఉన్నత వర్గాల, ఇటు మధ్య వర్గాల స్త్రీల దయనీయ గాథలను చిత్రించిన కరుణాకాతరమూర్తి. స్త్రీల విషయంలో అంతగా ఆలోచింపచేసిన రచయిత లేడనిపించాడు.

ప్రేమ్‌చంద్ ఎన్నుకున్న రంగం వేరు. అతడు అధోగతులకు ప్రాతినిధ్యం వహించాడు. పల్లెలో ఉన్న రైతులు, కూలీలు వారి జీవన విధానాన్ని చిత్రించాడు. అంతేకాదు వారి సమస్యలకోసం జీవితాంతం పోరాడాడు. ప్రేమ్‌చంద్ చిత్రించిన అధోలోకాన్ని గురించి అంతకుముందు ఎవరూ రాయలేదు. ప్రేమ్‌చంద్ రాసింతరవాత మరొకరు రాయడానికి సాహసించలేదు. ప్రేమ్‌చంద్‌ది ఒక నూతన మార్గం. అంతవరకూ మూసుకుని ఉన్న ద్వారాలను తెరిచాడు. అక్కడ వెలుగులు పరచాడు. ఆ విధంగా భారత జాతికి-అప్పటికి అపూర్వం అయిన- ఒక కఠిన సత్యాన్ని ఎరుకపరిచాడు. ప్రజల ఆలోచనా విధానం మీద అంత ప్రభావం వేసిన రచయిత కనిపించడు. రైతు, కూలీ దీనావస్థను చూచి అతని మనసు స్పందించింది. స్పందించిన గుండెలోంచి వచ్చిన గాథల్లో ఉన్న వాస్తవం కనిపిస్తుంది ప్రేమ్‌చంద్ రచనల్లో.

ప్రేమ్‌చంద్ తాను చూచిన సమాజాన్నే పరిశీలించాడు. రచనలు చేశాడు. అయితే అతని రచనల్లో పరిణతి చెందుతున్న ఆలోచనా విధానం కనిపిస్తుంది. తొలుత అతడు పచ్చని అడవి ఉన్న కొండమీద కూర్చుని గ్రామాన్ని చూచాడు. ఎత్తునుంచి ఊరు అందంగా కనిపిస్తుంది. గుడిసెలు, సొరపాదులు, పశువులు, చేలు, చెరువు చాల అందంగా కనిపిస్తుంది ఈ అందం అయిన పల్లెలే అతని తొలి రచనల్లో కనిపిస్తాయి. ప్రేమ్‌చంద్‌కు అది సంతృప్తిని ఇవ్వలేదు.

ప్రేమ్‌చంద్ కిందికి దిగాడు. ఒక బోడుమీదినుంచి పల్లెను చూచాడు. పల్లెలో ఉన్న మురికి అజ్ఞానం, దారిద్ర్యం కనిపించాయి. ఈ అరిష్టాలు దూరం కావాలని రచనలు సాగించాడు. వీటికి పరిష్కారంగా అతడు సంస్కారవాది అయినాడు. భారతీయ వ్యవస్థలోని ఆచార వ్యవహారాలలో ఏదో కొద్ది సంస్కారం తెస్తే చాలుననుకున్నాడు. అతనికి మానవతమీద ఉన్న విశ్వాసం అపారమైనది. మనిషి ఎన్నడయినా మంచిగా మారాడనుకున్నాడు. అలా మారిన మనిషిని చిత్రించాడు.

ప్రేమ్‌చంద్ సందేశం ఇచ్చి ఊరుకోలేదు. ఆచరించి చూపించాడు. నాడు జరుగుతూ ఉండిన స్వాతంత్ర్యోద్యమం మీద ఎన్నో ఆశలు పెట్టుకున్నాడు తాను ఉద్యోగం వదులుకున్నాడు ఖద్దరు మూటలు నెత్తిన పెట్టుకుని అమ్మాడు. చరకాలు చేయించి దారం తీయించాడు. పత్రికలు పెట్టి ప్రచారం చేశాడు. హిందూస్తానీ ఉద్యమం నడిపించాడు. అన్నిటినీ మించి ఆనాటి ఉద్య

మాన్ని వివరించే ''రంగభూమి'', ''కర్మభూమి'' లాంటి నవలలు రాసి ఉద్యమానికి ఉత్తేజం కలిగించాడు.

ప్రేమ్‌చంద్ ఇదంతా దిబ్బమీద లేక బోడుమీదఉండి చూచిన జీవితమే. ప్రేమ్‌చంద్ నేలమీదికి వచ్చాడు. ఆ పల్లెలోకి వెళ్ళాడు. అక్కడి పరిస్థితి వేరు. తాను ఇంతవరకూ చూచింది వేరు. రాసింది వేరు. అతను ఇంతకాలం నమ్మిన సిద్ధాంతాల మీద అతనికే ఏవగింపు కలిగింది. పరిస్థితులు తాను రాసినట్లు లేవు. అంతకంటే నికృష్టంగా ఉన్నాయి. తాను ఉంటుందనుకున్న మానవత కాల్పనికంగా కనిపించింది. తాను నమ్మిన వ్యవస్థలో తాను ఊహించి ''హృదయం'' కనిపించలేదు. తాను జరిపిన పోరాటం తాననుకున్న ''విముక్తి''కి తోడ్పడేటట్లు లేదు.

ప్రేమ్‌చంద్ నమ్మకాలు వమ్ము అయినాయి. అతని ఆశలు కూలిపోయాయి. అతడు జరిపిన పోరాటాలు పేకముక్కల మేడలా కూలిపోయాయి. ఈలోగా రష్యాలో విప్లవం విజయవంతం అయింది. అక్కడ శ్రామిక రాజ్యం నెలకొన్నది. అది అతన్ని ఎంతో ప్రభావితుణ్ణి చేసింది. గోర్కీ అతనికి వాస్తవవాదిగా కనిపించాడు. శ్రామిక రచయితగా గోచరించాడు. ''గోర్కీ రష్యా రచయిత మాత్రమే కాదు. అతడు ప్రపంచ శ్రామికుల రచయిత'' అన్నాడు. ''నేను బోల్షివిజాన్ని అంగీకరిస్తున్నాను'' అన్నాడు.

''బలవంతుడు బలహీనుని రక్తం పీలుస్తున్నంతకాలం ఇది తప్పదు. ఆ పీల్చేవాడు మనదేశంవాడే కావచ్చు, పరాయి దేశంవాడు కావచ్చు. బలవంతుడు బలహీనుణ్ణి పీల్చడం, కాస్తో కూస్తో అన్ని దేశాల్లోనూ వుంది. కాని రష్యాలో మాత్రం ఇలాంటివాళ్ల రోగం బాగా కుదిర్చారు. అక్కడ బీదవాళ్లు ఎంతో సుఖంగా జీవిస్తున్నారు. కొంతకాలం తరువాత మన దేశంలోకూడా అలా జరగవచ్చు'' అంటాడు.

ఈ పరిణామాలు ప్రేమ్‌చంద్‌ను వాస్తవవాదిని చేశాయి. అతడు సమాజంలోని వర్గస్వభావాన్ని అర్థంచేసుకున్నాడు.

ఇలాంటి దశలో ప్రేమ్‌చంద్ ''గోదాన్'' రచించాడు. 1936 మే నెలలో గోదాన్ వెలువడింది. అది మూడు సంవత్సరాల ప్రేమ్‌చంద్ నిరంతర శ్రమ ఫలితం. భారతీయ నవలా సాహిత్యంలో ''గోదాన్'' మకుటంలాంటి మహా రచన. యాభై ఏళ్ళ తరువాతకూడ అలాంటి నవల మళ్ళీ రాలేదు. 'గోదాన్'కు

దీటురాగల నవల "మాలపల్లి" మాత్రమే అనిపిస్తుంది. ప్రేమ్‌చంద్, ఉన్నవ ఒకే సంవత్సరంలో జన్మించారు. ఒకే రకంగా ఆలోచించారు. ఒకే రకపు రచన చేశారు. ఒకరికి ఒకరు తెలియరు. ఒకరి రచన మరొకరు చదివిఉండరు. ఇది యుగ ప్రభావం అయ్యుండాలి. ఇందును గురించి ఇంకెంతో చెప్పవచ్చు. కాని ఇక్కడ ప్రస్తుతం కాదు.

గోదాన్ వాస్తవవాద రచన. ఇందులో వర్గస్వభావం స్పష్టంగా కనిపించదు. ఎక్కడో దాక్కొని ఉంటుంది. వెదికి పెట్టుకోవాలి. గోదాన్‌లో ఏ వాదం ఉంది? అని విమర్శించడం విమర్శకుల పని. గోదాన్ పల్లెల వాస్తవ జీవితాన్ని చిత్రిస్తుంది. రంగులు లేకుండా గీసిన చిత్రం గోదాన్. ఈ నవలలో మనం అనుకున్నవి ఏవీ జరగవు ఇది రచయిత తనకు అనుకూలంగా మలచుకొన్న నవల కాదు. నవలకు అనుకూలంగా రచయిత రాసిన నవల. అయినా ఇందులో బొత్తిగా వాస్తవమే ఉందని చెప్పలేం. ప్రేమ్‌చంద్ ఆదర్శాలు అక్కడక్కడా కనిపిస్తాయి. ఆదర్శపాత్రలూ కనిపిస్తాయి. ఆదర్శ స్వభావం గల రచయిత వాస్తవవాద రచన చేయడానికి చేసిన ప్రయత్నం కనిపిస్తుంది.

ప్రేమ్‌చంద్‌కు ఉమ్మడి కుటుంబాల మీద ఉన్న నమ్మకం అంతా ఇంతా కాదు. గోదాన్‌లో ఇందు విషయంలో శిథిలం అవుతున్న ప్రేమ్‌చంద్ నమ్మకం కనిపిస్తుంది. హోరీకి ఇద్దరు తమ్ములు. కథ మొదలయ్యేవరకే వారు విడిపోయారు. చెరుకు అమ్మే విషయంలో తమ్ములను మోసం చేయడానికి హోరీ అబద్ధం ఆడాడు. ఇది అన్నదమ్ముల ఈర్ష్యాద్వేషాలకు వాస్తవ చిత్రణ. కాని హోరీ మరోసారి అలా ప్రవర్తించడు. తన ఆవుకు తమ్ముడు విషం పెట్టడం హోరీ చూస్తాడు. భార్య ధన్యతో చెపుతాడు. తీరా నేరం తమ్మునిమీద పడుతుందని తెలిసినప్పుడు తన కొడుకు "గోబర్" మీద ప్రమాణం చేస్తాడు. ఠాణాదారు వస్తాడు. హీరా ఇల్లు సోదా చేస్తానంటాడు. హోరీ అతనికి లంచం ఇవ్వడానికి డబ్బు అప్పు తెస్తాడు. హీరా పారిపోతే హోరీ అతని వ్యవసాయం చేసిపెడ్తాడు. హోరీ అంత్యకాలంలో హీరా తిరిగి వస్తాడు. తప్పు ఒప్పుకుంటాడు. పశ్చాత్తాప పడ్తాడు. అన్నదమ్ములు ఆర్ద్రంగా కలుసుకుంటారు. హోరీ రాతిపని దగ్గర పడిపోతే డోలీలో తెచ్చింది అతని తమ్ములే. అంతేకాదు. హోరీ ఇంట్లో ఉపవాసాలు జరుగుతుంటాయి. అప్పుసైతం పుట్టేదశ దాటిపోయింది. హీరా భార్య "పున్య" ఆదుకుంటుంది. గింజలు గంపల్లో తెచ్చి

దింపుతుంది. అయినా మార్పు స్పష్టంగా కనపించేది హోరీ కొడుకు గోబర్ తండ్రి నుంచి విడిపోయేప్పుడు. గోబర్ తన భార్య జునియాను తీసుకొని లక్నో వెళ్ళిపోతానంటాడు. హోరీ భార్య ధన్య ఒప్పుకోదు. నానా గొడవ చేస్తుంది. అప్పుడు హోరీ అంటాడు- ''ఉండనన్నవాణ్ణి కట్టిపడేస్తామా? పిల్లలను పెంచి పోషించడం తల్లిదండ్రుల ధర్మం. మనం ఆ ధర్మం నిర్వర్తించాం. వాళ్ళకు రెక్కలు వచ్చాయి. ఉండమంటే ఉంటారా? వెళ్ళనీయి.'' ఇవి హోరీ మాటలు కావు. ప్రేమ్‌చంద్ ఆలోచనా విధానం ఇంతకూ హోరీ చనిపోయినప్పుడు గోబర్ ఉండడు. శిథిలం అయిపోతున్న ఉమ్మడి కుటుంబ వ్యవస్థను బాధగా అంగీకరిస్తాడు ప్రేమ్‌చంద్. పరిణామదశలో రాసిన నవల గోదాన్. ఆ తరువాత ప్రేమ్‌చంద్ జీవించిఉంటే మరికొన్ని నవలలు రాసిఉంటే వారిలో ఈ ఊగిసలాట ఉండేదికాదు. ఒక స్పష్టం అయిన ఆలోచనా విధానం కనిపించేది.

ప్రేమ్‌చంద్‌కు గ్రామ వ్యవస్థమీద అచంచలం అయిన విశ్వాసానికి ప్రతీక ''పంచ్ పరమేశ్వర్'' అనే కథ. తగాదాలో తీర్పు చెప్పేప్పుడు ''పంచులలో పరమేశ్వరుడు ప్రవేశిస్తా''డంటారు ఆ కథలో ప్రేమ్‌చంద్. 'గోదాన్'లో ఆ విశ్వాసానికి గండిపడింది. అది పూర్తిగా కూలిపోతుంది. ''పంచ్‌మేఁ పరమేశ్వర్ హోతాహై'' అంటాడు హోరీ ''యహ్ఁ పంచ్ నహీ పిశాచ్‌హైఁ'' అంటుంది ధన్య. ఈ మాట అనిపించడానికి ప్రేమ్‌చంద్ ఎంత వేదన అనుభవించారో ఆ సంఘటన వ్యక్తం చేస్తుంది.

గోబర్. భోలా కూతురు జునియాను ప్రేమించాడు. ఆమె వితంతువు. ఆమె గర్భం దాల్చింది. జునియా హోరీ ఇంటికి వచ్చింది గోబర్ లక్నో పారిపోతాడు జునియాను చూచి ధన్య ముందు మండిపడుతుంది. తరువాత ఆమెలో స్త్రీత్వం మేలుకుంటుంది. ఆమె జునియాకు ఆశ్రయం ఇస్తుంది. కోడలుగా స్వీకరిస్తుంది. ఊరు సొంతం కన్నెర్ర చేస్తుంది. వారిని బహిష్కరిస్తుంది. అయినా ధన్య చలించదు. స్వయంగా జునియా తండ్రి భోలా కూతురును చంపేస్తానని వస్తాడు. అయినా ధన్య దేవతలా జునియాకు నీడ నిస్తుంది. ఊళ్ళో పంచులు కూడ్తారు. పంచుల్లో దాతాదీన్ కూడా ఒకడు. అతని కొడుకు ఒక మాలపిల్లను ఉంచుకున్నాడు. అతడు జునియాను ఇంట్లో

ఉంచుకోవడాన్ని నిరసిస్తాడు. పంచులందరూ ముక్త కంఠంతో హోరీ మీద వంద రూపాయిల జరిమానా విధిస్తారు.

''మీరు పంచులు కారు రాక్షసులు. నా కోడల్ను ఇంట్లో పెట్టుకున్నాను. అందుకు ఇంత కఠిన శిక్ష విధిస్తారా? నా శాపం మీకు తగలకపోదు" అంటుంది ధన్య.

ఈ ఉదంతం ఆధారంగా మొత్తం సమాజాన్ని బట్టలు ఊడదీసి బరి బద్దలుగా చూపిస్తారు ప్రేమ్‌చంద్.

ఆ ప్రాంతానికి జమీందారు రాయ్‌సాబ్ అగర్‌వాల్‌సింగ్. వారూ స్వాతంత్ర్య ఉద్యమంలో పాల్గొన్నారు. కౌన్సిల్ సభ్యత్వం వదులుకున్నారు. జేలుకు వెళ్ళారు. దాంతో ఎంతో పేరు ప్రఖ్యాతులు ఆర్జించుకున్నారు. వారిని గురించి చెప్పేప్పుడు ప్రేమ్‌చంద్ ''సింహం ఏంచేస్తుంది? వేటాడుతుంది. అది అరవకుండా, ఉరక్కుండా తీయని మాటలతో మృగం లభించిందనుకోండి. అది ఎందుకు పరిగెత్తాలి? అక్కడే ఉండి అన్నీ సాధించుకుంటుంది.'' దేశభక్తి ముసుగులో దౌర్జన్యం చలాయించేవాడు రాయ్‌సాహెబ్. వారికి హోరీమీద జుర్మానా విధించిన విషయం తెలిసింది. గ్రామాధికార్లను పిలిపించారు. నానా మాటలు అన్నారు. ఇంతకూ వారి కోపం ఏమంటే ఆ జరిమానా డబ్బు తమ ఖజానాలో జమ కాలేదని! దేశభక్తుల విషయంలో శిథిలం అవుతున్న ప్రేమ్‌చంద్ విశ్వాసాలకు ప్రతీక రాయ్‌సాహెబ్. వారు చెప్పే నీతులకు అంతులేదు. స్వరాజ్యం కావాలంటారు. ఎందుకు? తమ జమీందారీని రక్షించుకోవడానికి!

ఇదే సందర్భంలో పత్రికలవారి బండారం కూడా బయటపెట్టారు. ఓంకార్‌నాథ్ ''బిజిలీ'' పత్రికకు సంపాదకుడు. తాను ఎంతో నిజాయితీగల దేశభక్తుణ్ణి అంటాడు. స్వదేశీ ఉద్యమ ప్రచారంకోసం పత్రిక పెట్టానంటాడు. విదేశీ వస్తువుల ప్రకటనలు వేస్తాడు. తన పత్రిక అమ్ముడు కాలేదని ఏడుస్తాడు. తనకు గుర్తింపు రాలేదని అతని బాధ.

గ్రామ పెత్తందార్లను రాయ్‌సాబ్ గద్దించాడు. వాళ్ల వంద రూపాయాలు కక్కాల్సివచ్చింది. వాళ్లు ఒక ఉపాయం చేశారు. జమీందారు దౌర్జన్యాన్ని గురించి ''బిజిలీ''కి ఒక లేఖ రాశారు. రాయ్‌సాబ్ ఓంకార్‌నాథ్ దగ్గరికి వెళ్లారు వందమంది చందా తామే కడ్తామన్నారు. ఓంకార్‌నాథ్ ఆదర్శాలు ధనం ముందు బలి అయిపోయాయి. ఆ వార్త ప్రచురించలేదు.

ఇలాంటి దేశభక్తుల్లోనే ఖన్నా ఒకరు. వారు స్వదేశీ చెక్కెర ఫ్యాక్టరీ పెట్టారు. కూలీలకు కూలి తగ్గిస్తే వాళ్లు సమ్మె కట్టారు. గోబర్ అప్పుడు అక్కడే పనిచేస్తున్నాడు. కూలీల పక్షం వహించి తన్నులు తిన్నాడు. సమ్మెకు నాయకత్వం వహించిన వారిలో ఓంకార్‌నాథ్ కూడా ఉన్నాడు. వేడి వేడి కబుర్లు వేసి లక్షల పత్రికలు అమ్ముకున్నాడు. పోలీసు దాడి జరిగేప్పుడు పారి పోయి దాక్కున్నాడు.

పత్రికా రచన పరమ పవిత్రంగా తన సర్వస్వం ధారపోసి పత్రికలు నిర్వహించిన ప్రేమ్‌చంద్‌కు ఇలాంటి సంపాదకులు ఎదురయి, వారి నమ్మకా లను కూల దోశారు. పత్రికా సంపాదకులుగా వారి వేదన ఇందులో వ్యక్తం అవుతుంది. ప్రేమ్‌చంద్ ప్రయత్నాలూ, నమ్మకాలూ విఫలం కావడం మనం హోరీపాత్రలో చూస్తాం. హోరీకి జయం కలగలేదు. అడుగడుగునా అప జయాలే ఎదురవుతాయి. అపజయాలను అపజయాలుగానే చిత్రించిన వాస్తవిక రచన గోదాన్.

''గోదాన్'' మరో ప్రత్యేకత ఒకవేపు నగర జీవితాన్నీ, మరోవైపు పల్లె జీవితాన్నీ వర్ణించడం. నగరంలో విలాసజీవితంగడిపే జమీందారు అమర్ పాల్ సింగ్ ఆడంబరాలకు పోతాడు. ప్రిస్టేజి కోసమని లక్షలకు లక్షలు కర్చు చేస్తాడు. కూతురుకు ఘనంగా పెళ్లి చేస్తాడు. కూతురు దాంపత్యజీవితం విఫలం అవు తుంది. దావావేసి లక్షల ఆస్తి ఆర్జిస్తాడు. కౌన్సిల్ మెంబరుగా మరో మహా రాజుతో పోటీచేసి నెగ్గుతాడు. పెళ్లి దగ్గరకి వచ్చేవరకు కొడుకు తన మాట వినడు. మాలతి చెల్లెల్ను పెళ్లి చేసుకుంటాడు. ఇంగ్లండు వెళ్లిపోతాడు. తండ్రి మీద దావావేస్తాడు. జీవితంలో జమీందారుకూ అశాంతి, నిరాశ, అపజయాలే ఎదురవుతాయి.

ఖన్నా పరిశ్రమాధిపతి. అతని భార్య గోవిందితో అతనికి సరిపడదు. మాలతిని కోరుకుంటాడు. చెక్కెర ఫ్యాక్టరీ పెడతాడు. అందులో సమ్మె జరుగు తుంది. ఆ తరువాత ఫ్యాక్టరీ తగలబడుతుంది. అప్పుడుగాని గోవింది హృదయం అతనికి అర్థంకాదు. కష్టాల్లోనే భార్యాభర్తలు ఒకరిని ఒకరు అర్థం చేసు కుంటారని ప్రేమ్‌చంద్ నమ్మాడు. ఇందుకు ఉదాహరణలు ఈ నవల్లో అనేకం ఉన్నాయి. ఖన్నాకు కూడా జీవితంలో నిరాశయే ఎదురయింది.

మహతా ఫిలాసఫీ ప్రొఫెసర్. మాలతి డాక్టరు. నగర జీవితంలో మనుషుల్లా కనిపించేవారు వీరే. వీరికి మానవత ఉంది. దేశాన్ని గురించీ సమాజాన్ని గురించీ ఆలోచిస్తారు. గోబర్‌కు ఆశ్రయం ఇచ్చింది వీరే. ''త్యాగం చేయడంలో ఉన్న ఆనందం మరొకదానిలో లేదు" అంటుంది మాలతి. ''మనం పెళ్లి చేసుకుని, సంసారం ఏర్పర్చుకొని మన సుఖాలకోసమే పాటుపడ్డం నాకు ఇష్టం లేదు. మనం స్నేహితులంగానే ఉండిపోదాం. సకల జనుల సౌఖ్యానికి పాటుపడదాం'' అని నిర్ణయించుకున్న త్యాగధనులు వారు ఈ నవల మొత్తంలో వీరిద్దరే జయాపజయాలను గురించి ఆలోచించక సేవామార్గం అవలంబించిన కర్మయోగులు.

ఓంకార్‌నాథ్ వ్యక్తిత్వాన్ని అర్థం చేసుకున్న తరవాత బ్రోకర్ తినాఖావంటి నీచుడు కనిపించడు. అతడు ఎన్నికల స్పెషలిస్టు. డబ్బుకోసం ఏ ద్రోహానికైనా తలపెట్టగల దిట్ట. ఈ నగర జీవితంలో మిర్జా ఖుర్షిద్‌ది ఒక గమ్యంలేని పాత్ర. అతడు ఆటలు ఆడిస్తాడు. సమ్మెలు చేయిస్తాడు. పంచదార మిల్లులో సమ్మె చేయించి దెబ్బలు తిని దవాఖానాలో పడ్తాడు.

గోబర్‌ను పట్నానికి తెచ్చింది పట్నాల్లోని శ్రామిక జీవనం చిత్రించడానికి. గోబర్ మిర్జా ఖుర్షీద్ దగ్గర కొలువుంటాడు. టీ దుకాణం పెట్టి డబ్బు సంపాదిస్తాడు. మిర్జాకే అప్పుపెడ్తాడు. వాడలో వాళ్లందరికీ తలలో నాలుక అవుతాడు. జునియా రాగానే అతని జీవితం మారిపోతుంది. తాగుబోతు అవుతాడు. జునియాను కొడ్తాడు. బాధిస్తాడు. జునియా ప్రసవ సమయంలో ఆదుకున్న మాతృమూర్తి బోహియా జునియా బిడ్డకు పాలివ్వడానికి ఎండిపోయిన చన్నుల్లో పాలు చేపుతుంది. ఎంత బండబారిన సమాజంలో నయినా మానవతామూర్తులుంటారని చూపడానికి ప్రేమ్‌చంద్ బోహియాను ప్రవేశ పెట్టాడు. గోబర్ సమ్మెలో పాల్గొని చావ దెబ్బలు తినివస్తాడు. అప్పుడు అతనికి జునియా మనసు అర్థం అవుతుంది. కష్టాల్లోనే భార్యా భర్తలు పరస్పరం అర్థం చేసుకోగలరు అనడానికి ఇదొక ఉదాహరణ. తరవాత వీరిద్దరూ మహతా, మాలతి నీడన చేరిపోతారు. ఆ తరువాత వారి వ్యక్తిత్వాలు అంతగా కనిపించవు. హోరీ చనిపోయినపుడు గోబర్ పట్నంలోనే ఉన్నాడు జునియా, మంగల్ పల్లెలో ఉన్నారు.

నగరజీవితానికి సంబంధించిన కథతో పల్లెజీవితానికి అట్టే సంబంధం లేదు. ప్రధాన కథఅయిన హోరీ జీవితానికి నగరకథతో ఏమాత్రం సంబంధం లేదు. రెండూ వేరువేరు కథలుగా కనిపిస్తాయి. నగరకథ సాంతం తీసివేసినా గోదాన్ సంపూర్ణంఅయిన నవల అవుతుంది. ఈ రెండు కథలు ఇసుక, నీళ్ళు కలిసినట్లుంటాయి. అయితే ఒకందుకు ఈ కథ పనికి వస్తుంది. ఇది ఇది రెండువర్గాల వర్ణన. విలాసవర్గం ఒకటి. శ్రామికవర్గం ఒకటి. శ్రామిక వర్గం అంటే రైతులు, వ్యవసాయకూలీలే. పరిశ్రమల్లో పనిచేసే కార్మికులను గురించి ప్రేమ్‌చంద్‌కు అంతగా తెలియదు. అందుకే అందునుగురించి అంతగా వ్రాయకుండా తప్పుకున్నారు. సమ్మెకూడా పటిష్ఠంగా జరగదు. సమ్మెచేసిన ఫ్యాక్టరీ తగలపెట్టారనే ధ్వనివచ్చేట్లు రాయడం అందుకు నిదర్శనం. ప్రేమ్ చంద్‌కేకాదు ఈనాటికీ పారిశ్రామిక శ్రామికుల జీవితం తెలిసిన రచయితలు అరుదు. రచనారంగంలో మనం ఇంకా వ్యావసాయిక నాగరికతలోనే ఉన్నాం.

గ్రామజీవితాన్ని చిత్రించడంలో ప్రేమ్‌చంద్‌ను మించినవారు లేరనడం సహజోక్తిమాత్రమే. గ్రామాలంటే అతనికి అపారమయిన అభిమానం-అసక్తి. గ్రామజీవితానికి వాస్తవ చిత్రణ గోదాన్. ఈ నవలలో వాస్తవాన్ని సహజంగా చిత్రించడం జరిగింది. అప్పులిచ్చేవాళ్ళకు మించిన పీడ గ్రామాలకు మరొకటి లేదు. అందులోనూ ఆధ్యాత్మిక జీవితానికి ప్రతినిధులం అనిపించుకునే బ్రాహ్మణులు అప్పులు ఇవ్వడం ఉత్తరభారతంలో ఒక వ్యవస్థగా ఉన్నట్లుంది. దాన్ని చూచి ప్రేమ్‌చంద్ మనసు విలవిలలాడి "సవాసేర్ గెహూం" అని ఒక కథ రాశారు. ఆ కథకు విస్తృత రూపమే "గోదాన్" లా కనిపిస్తుంది. 'సవాసేర్ గోధుమల' బ్రాహ్మణదేవత "గోదాన్" దాతాదీన్ ఒకలాంటివారు. ఒకచోట శంకర్, ఇంకోచోట హోరీ బ్రాహ్మణుని అప్పు ఎగవేస్తే నరకానికి పోతామని వణికిపోతారు. బ్రాహ్మణ షావుకార్లు బెదిరించడంకూడా పరలోకం పేరనే.

అప్పులవాళ్లు వేటగాళ్ళలో హోరీని వేటాడుతుంటారు. హోరీకి, మృగానికి తేడా ఏమంటే మృగం పారిపోవడానికి ప్రయత్నిస్తుంది. హోరీ అక్కడే నుంచొని వేటగాని బాణాలకు గురవుతుంటాడు, ఏడుస్తుంటాడు, కాని కదలడు. ఝింగ్రీసింగ్, దాతాదీన్, పంజేశ్వరి అందరికీ రుణపడ్డాడు హోరీ. అయితే చేసిన అప్పులేవీ తిండికోసంకాదు. బట్టకోసంకాదు. 'మర్యాద'కోసం. తన కుటుంబాన్ని పస్తులుంచి 'మర్యాద' కోసం పంటనంతా పంచులకు ఇస్తాడు. వారు లాక్కొ

వడం కాదు. హోరీ స్వయంగా మోసుకుపోయి వారింటికి చేరుస్తాడు. జీవితం సాంతం ఈ ''మర్యాద'' కోసం బలిచేస్తాడు హోరీ రైతు బలి అవుతున్నది అవసరాలకు కాదు- ఈ 'మర్యాద'కు. హోరీ పెళ్ళిళ్ళకుకూడా అప్పుచేయలేదు. అతను చిక్కుకున్నది ఈ 'మర్యాద' వలలో. ఆ ఉచ్చు బిగుస్తూ పోయింది. అందులోనే ఆతడు గటుక్కుమన్నాడు.

భోలా దగ్గర ఆవును అప్పు తెచ్చాడు. ఆవుకు తమ్ముడు విషంపెట్టి చంపాడు. తమ్ముని మర్యాదకోసం విలవిల్లాడాడు. భార్యను చావబాదుతాడు. భోలా తన అప్పు వసూలుచేయడానికి వస్తాడు. ఎద్దులకు విప్పుకుపోతాడు. ఊరు సాంతం భోలాను అడ్డుతుంది. కాని హోరీ భోలాను రక్షిస్తాడు. ఎద్దులు వదితే స్తాడు. హోరీ కూలి కావడానికి వప్పుకుంటాడు కాని అబద్ధం ఆడడానికి వప్పుకోడు. తన పొలంలో తానే కూలీగా మారిపోతాడు.

హోరీ ఇంట్లోని వాళ్ళ పోషణకన్నా గ్రామంలో తన మర్యాదకోసం ఎక్కువ పాటు పడతాడు. అతడు సత్యవంతుడు అనలేం. వెదురు కరీదుదగ్గర అబద్ధం ఆడాడు. ఆ ఫలితం హోరీకి దక్కదు. వెదురు కొన్నవానికి దక్కుతుంది. చక్కెరఫ్యాక్టరీ వెలిస్తే చెరుకు అమ్ముకుని డబ్బుతీసుకోవచ్చని మురుస్తాడు. చెరుకు ఫ్యాక్టరీకి తీసికెడితే అక్కడ ఐంగ్రీసింగ్ ప్రత్యక్షం. అప్పుకింద అంతా విరగకోసుకొని పాతికరూపాయలు అందచేస్తాడు. ఆ డబ్బు కాస్తా కోఖేరాం కాజేస్తాడు. ఏడాది కష్టంతరవాత మిగిలింది రిక్తహస్తాలు. అంతే కాదు— ఇంకా తీరని అప్పులు? ఇదీ హోరీస్థితి కాదు- రైతులదుర్దశ. పరిశ్రమలు పెరగడంవల్లకూడా ఈ పరిస్థితి మారదని ప్రేమ్‌చంద్ హెచ్చరిక!

హోరీ కిస్తుబాకీ పడ్డాడు. అది చెల్లించకుంటే పొలం ఊడుతుంది. రూపాను రామ్‌సేవక్‌కు ఇచ్చి పెళ్లిచేసి కిస్తు చెల్లిస్తాడు. రామ్‌సేవక్ ముసలివాడు. రూపను రామ్‌సేవక్‌కు అమ్ముకున్నాననే మానసిక వేదనతో కృంగిపోయాడు హోరీ. ఆ మనోవేదనతోనే అతడు కన్నుమూశాడు.

హోరీ చిరకాల కోరిక ఒక ఆవును ఇంటిముందు కట్టడం. జీవితాంతం అది ఫలించలేదు. చనిపోయింతరువాత ధన్య ఇంట్లో ఉన్న 20 అణాలు ''గోదానం'' అని దాతాదీన్‌కు ధారపోస్తుంది.

హోరీ జీవితంలో అడుగడుగునా ఓటమి లభించింది. ఓడిపోయి చనిపోయాడు. ఇది హోరీ ఓటమి. ప్రేమ్‌చంద్ ఓటమి. ఈ దేశంలో సగటు

మనిషి ఓటమి. మన అవసరాలకన్నా ''మర్యాద''కు ప్రాముఖ్యత ఇచ్చినంత కాలం ఈ ఓటమి తప్పదు.

గోదాన్‌లో హోరీకి ఉన్నంత ప్రాధాన్యత ధన్యకు ఉంది ధన్య మర్యాద కోసం చచ్చే బాపతు కాదు. ఆమెది వాస్తవిక దృక్పథం. హీరా ఆవుకు విషం పెట్టిన విషయం హోరీ దాచడానికి ప్రయత్నిస్తాడు. అప్పుడామె విప్లవ మూర్తిగా విజృంభిస్తుంది. అందరినీ హడలకొడుతుంది. ఊరి వాళ్ళతో 'శక్తి' అనిపించుకుంటుంది. జునియాను ఇంటికి పంపి పిరికివాడై గోబర్ పారి పోతాడు. 'ధన్య' లోని స్త్రీత్వం పొంగులు వారుతుంది. సమాజాన్ని ఎదుర్కొని జునియాకు స్థానం ఇస్తుంది. సమాజం ఆమెను బహిష్కరించింది. పంచాయతీ జరిమానా విధిస్తే, హోరీ పంట సొంతం కోసుకుపోతుంటే భర్తకు ఎదురు తిరుగుతుంది. కొంత ధాన్యం ఇంటికి చేరుస్తుంది. జునియా తండ్రి భోలా ఎద్దు తీసుకుపోతాడు. అయినా చలించదు. కాని కొడుకును తీసుకుని జునియా వెళ్ళిపోతుందంటే ఆమె గుండె వక్కలు, ముక్కలు అవుతుంది. తన కొడుకును వేరు చేస్తున్నందుకు జునియాను శాపిస్తుంది. అయితే ఆమె క్షమామూర్తి రెండోసారి జునియా వచ్చినప్పుడు ఆమెను స్వీకరిస్తుంది. హోరీ చనిపోయి నపుడు ధన్య ఇంట్లో ఉన్నది జునియా మాత్రమే.

ధన్య సలియాను కూడా కాపాడింది. సలియా హరిజన కన్య. బ్రాహ్మణ మూర్తి మాతాదీన్ ఉంచుకున్నాడు. సలియా పొలం పనులన్నీ చేసేది. స్వతంత్రించి సోలెడు గింజలు ఇచ్చినందుకు దాతాదీన్ ఆమెను వెళ్ళగొడ్తాడు. తమ మాట వినలేదని పుట్టింటివారు రానివ్వరు. అలాంటి సమయంలో మాతృ మూర్తిలా ధన్య సలియాకు నీడ ఇచ్చి కాపాడుతుంది. చివరకు మాతాదీన్ సలియా ప్రేమను గుర్తిస్తాడు. ఆమెను స్వీకరిస్తాడు. సలియా సామాన్య స్త్రీ కావచ్చు. కాని ఆమెకు మంచి మనసుంది. ప్రేమ ఉంది. హోరీ కూతురు సోనాకు మంచి సంబంధం వచ్చింది. కట్నం అడిగారు. సలియా మధుర దగ్గరికి రాయబారం వెళ్ళింది. మధురకు సోనా హృదయం తెలియజేసింది. కట్నం లేకుండా పెళ్ళి చేసుకోవడానికి ఒప్పించింది. సోనా పెళ్ళి కానీ కట్నం లేకుండా చేయించింది. ఇలాంటి పెళ్ళిళ్లు జరగాలని ప్రేమ్‌చంద్ ఆశయం. ప్రేమ ఫలించాలనీ, ధనాశమధ్య ప్రేమ నశించరాదనీ వారి ఆశయం. సలియా

సోనా పెళ్ళికి కారకురాలు అయింది, మరో సందర్భంలో సలియా సోనా ఇంటికి వెళ్తుంది. సోనా ఆమెను తిట్టి తరిమేస్తుంది.

ధన్య మాతృమూర్తి. ఆమె దగ్గర క్షమాగుణం మెండు. ఆమె 'మర్యాద' కంటే కుటుంబ జీవనానికి ఎక్కువ ప్రాధాన్యత ఇస్తుంది. ఇంట్లో వాళ్ళను పస్తులుంచి ఊళ్ళో మర్యాద కాపాడుకోవడం ఆమెకు నచ్చదు. ఆమె ఆదర్శ భార్య. హోరీతో అనేక విషయాల్లో జగడానికి దిగుతుంది. తిడ్తుంది. తన్నులు తింటుంది. కాని భర్తమీద ఈగ వాలితే సహించదు. అతనిని ఆదుకోవడానికి తన సర్వస్వం ధారపోయడానికి వెనుకంజ వేయదు. ఆమెకు అసంతృప్తి లేదు. అన్యాయంమీద తప్ప కోపం, వ్యక్తులమీద లేదు. ఆమెకు భూదేవి అంతటి సహనం ఉంది.

సంసారం చితికి పోయింది. ఇల్లు ఒక ప్రక్క కూలిపోయింది. ఎన్ని కష్టాలు వచ్చినా రైతుగా జీవించాలన్న కోరిక కుప్పగా కూలిపోయింది. వాళ్ళు కూలీలుగా మారిపోయారు హోరీ రాళ్లుకొట్టే కూలికి పోతాడు ధన్య పురికొస పేని డబ్బు సంపాదిస్తుంది. హోరీ చనిపోయేప్పుడు ఇంట్లో ఉన్నవి ఇరవై అణాలే. అది ధన్య సంపాదన.

హోరీ మరణ శయ్యమీద ఉన్నాడు ధన్య కన్నీరు కట్టలు తెంచుకొని ప్రవహిస్తుంది. "వదినా! గుండె రాయి చేసుకో. అన్న వెళ్ళిపోతున్నాడు. గోదానం చేయించు" అన్నాడు హీరా.

ధన్య హీరాను అదోలా చూచింది తాను గుండె రాయి చేసుకోవాలి! భర్త విషయంలో తన ధర్మం ఏమిటి? జీవితాంత సాహచర్యానికి ఏడవడమే ధర్మమా ? అనుకుంది.

"సమయం ఆసన్నం అయింది. గోదానం చేయించు" అక్కడ కూడిన వారంతా అన్నారు.

ధన్య యంత్రంలా లేచింది. తాను పురికొస అమ్మి తెచ్చిన ఇరవై అణాలు తెచ్చింది. చల్లపడిన హోరీ చేతిలో ఉంచింది. ఎదురుగా ఉన్నాడు దాతాదాన్ "మహరాజ్! ఇంట్లో ఆవు లేదు. దూడ లేదు. డబ్బు లేదు. ఉన్నదంతా ఇంతే. ఇదే వీరు ధారపోసే గోదానం!" అన్నది.

ధన్య కళ్ళు తిరిగి పడిపోయింది.

ఇది గోదాన్ చరమ ఘట్టం. హోరీని చంపిన ప్రేమ్‌చంద్ ధన్యను ఉంచేశాడు. "ధన్య'' అన్న పేరే గొప్పగా పెట్టాడు. ఆమె వాస్తవంగా ధన్యురాలు. తాను నమ్మినదాన్ని ఆచరించింది. పతితులకు ఆశ్రయం ఇచ్చింది. భర్తకు అండగా నిలిచింది. తన సంపాదనతో హోరీ చేత గోదానం చేయించింది. ప్రేమ్‌చంద్ ధన్య పాత్రను మలచిన తీరు అద్భుతం అయింది.

గోదాన్ వాస్తవాల చిత్రణ. ఆదర్శాలు లేవని కాదు. కాని తక్కువ. ప్రేమ్‌చంద్ తన 'గోదాన్''లో ఉద్యమాలు నిర్మించలేదు. కర్మభూమి, రంగభూమి ఉద్యమాల చిత్రణే. ఆ రెండింటి తరువాత రాసిన గోదాన్‌లో ఉద్యమాలు మరింత ఉధృతంగా ఉండాల్సింది. కాని ప్రేమ్‌చంద్‌కు ఉద్యమాల విషయంలో నిరాశ కలిగింది. కాబట్టి గోదాన్‌లో వ్యక్తులను తీర్చిదిద్దాడు - ఉద్యమాల ఊసుకు పోలేదు. అయితే నవల చదువుతున్నంతసేపూ ఏదో పాత్ర తిరుగుబాటు చేస్తుంది అనిపిస్తుంది, కాని ఏదీ పూర్తిగా తిరగబడదు. అలా అని తిరుగుబాట్లు రాలేదని కాదు. సకృత్తుగా వచ్చాయి. చల్లబడ్డాయి. ఆనాటి నుంచి వచ్చిన ఉద్యమాలన్నీ సకృత్తుగానే వస్తున్నాయి చల్లబడుతున్నాయి.

నవల మొదట్లో గోబర్ మాటలు వింటుంటే ఒక తిరుగుబాటుతరం అవతరిస్తుందేమో అనిపిస్తుంది. కాని గోబర్ పట్నంవెళ్ళి డబ్బు వడ్డీలకు ఇస్తాడు. రెండువందల రూపాయలు రొంటిన కట్టుకుని ఇంటికి వచ్చినప్పుడు ఊళ్ళో తిరుగుబాటు తెస్తాడేమో అనిపిస్తుంది. ఊరి పెద్దలను సైతం వదకిస్తాడు. హోలీ నాటి రాత్రి జరిగిన ఉత్సవంలో ధ్వన్యనుకరణ చేసి పెద్దలందరినీ అపహాస్యం పట్టిస్తాడు. అది అంతటితోసరి. లక్నో వెళ్ళిపోతాడు. మిల్లులో చేరి సమ్మె చేస్తాడు దావుదెబ్బలు తింటాడు. అంతే. మళ్ళీ తిరుగుబాటు జోలికిపోడు.

ఆవుకు హీరా విషంపెట్టి ఆవు చనిపోయిన తరవాత ధన్య మహాకాళి అవుతుంది. ఆమె ఎవరినీ లెక్కచేయదు. హోరీ లంచం ఇవ్వడానికి అప్పు తెచ్చిన డబ్బుమూట నడిబజారులో లాగి గ్రామ పెద్దల బండారం బయట పెడుతుంది. వాళ్ళను తిడుతుంది. శపిస్తుంది. శాపనార్థాలు పెడుతుంది. ''ధన్య తన సాహసంతో ఆడవాళ్ళకే కాదు, మగవాళ్ళకు కూడా నాయకురాలు అయింది. ధన్య సాక్షాత్తు దేవి అవతారం అనుకున్నారు జనులు'' అంటాడు ప్రేమ్‌చంద్. కాని ధన్య నాయకత్వం నిలవదు. చల్లబడిపోతుంది. ఆమె ఒక ఉదాత్తపాత్రగా మారిపోతుంది.

ధన్య జునియాలాంటి పతితకు ఆశ్రయం ఇవ్వడం సామాన్యం కాదు. అది ఆమె ఉదాత్తత. ఇందు విషయం విచారించడానికి పంచాయతి జరుగుతుంది. కులంనుంచి బహిష్కరించడం జరిగింది. జరిమానా విధించారు. అప్పుడు ఆమెలో తిరుగుబాటు తలెత్తింది. "మాకు కులంతో పనిలేదు. మోక్షం ప్రసాదిస్తారు గామాలు. అది మాకు ఆక్కరలేదు. చమటోడ్చి సంపాదిస్తున్నాం. మా రెక్కల కష్టంతో బతుకుతాం." అంటుంది.

"వీళ్ళు పంచులు కారు, పిశాచులు" అంటుంది. హోరీ పంట సొంతం జరిమానా కింద దోచిపెడుతుంటే భర్త మీదికే తిరగబడుతుంది. పరిగ నూకలు దక్కించుకుంటుంది.

ధన్యలాంటి పాత్ర ఆర్థికపు వత్తిడులకు చితికిపోతుంది. కూతురును అమ్ముకోవడానికి, ముసలివానికి కట్టిపెట్టడానికీ సిద్ధం అవుతుంది. మన వ్యవస్థ అలాంటిది. లొంగిపడి ఉండటం నేర్పుతుంది. తిరగపడినీయదు !

మరో మహత్తరం అయిన సంఘటన హరిజనుల తిరుగుబాటు. సలియాను మాతాదీన్ ఉంచుకున్నాడు. అదీ లాభసాటికే. ఆమె బానిసలా చాకిరి చేస్తుంది. కళ్ళంలో నూర్పిడి జరుగుతూంది. సలియా ఎప్పుడో అప్పు చేసింది. దానికింద దులారీకి సోలెడు గింజలిచ్చింది. మాతాదీన్ తండ్రి బ్రాహ్మణదేవత దాతాదీన్ చూచాడు మండిపడ్డాడు. గింజలు లాక్కున్నాడు. మాతాదీన్ సలియాను చావబాదాడు. సలియా తలిదండ్రులు, అన్నలు అది చూచారు. సహించలేకపోయారు. విజృంభించారు. మాతాదీన్. మీదికి ఉరికారు. అతని జంధ్యం తెంపేశారు, బాదారు. నోట్లో మాంసం ముక్కలు పెట్టారు. బ్రాహ్మణుడు పతనం అయిపోయాడు. ఛండాలుడుగా మారిపోయాడు. అంతే, అంతటితో అది చల్లబడిపోతుంది. సలియా ధన్య ఇంటికి చేరింది. మాతాదీన్ గయలో ప్రాయశ్చిత్తం చేసుకుని వచ్చాడు. అయితే సలియా ప్రేమ అతని మనసు మార్చేస్తుంది. అతనిలో సంస్కారం కలుగుతుంది. సలియాతో ఉండిపోవడానికి నిశ్చయించుకుంటాడు, ఉండిపోతాడు.

ప్రేమ్‌చంద్ సమాజంలో చైతన్యం తేవాలనుకున్నాడు. విప్లవోన్ముఖము లయిన రచనలు చేశారు. గోదాన్ వరకు వచ్చే వరకు వాస్తవ దృష్టితో చూచి "గోదానం" చేయించి కన్ను మూశారు. గోదాన్‌లో ప్రేమ్‌చంద్‌ది వాస్తవిక దృష్టి. ఇందులో ఆదర్శాల ఆరాటం కనిపించదు. సంస్కరణల ఛాయలు గోచ

రించవు. ఇది మన సమాజం అని బట్టబయలు చేసి చూపించారు. ఈ సమాజంలో సహజంగా ఉన్న పాత్రలు, సంఘటనలే ఇందులో ఉన్నాయి. సమాజం ఇలా ఉండడానికి కారణం ఏమి అనే ఆలోచనలు మనలో కలిగిస్తుంది గోదాన్. హోరీ చనిపోయింతరువాత, ధన్య పడిపోయింతరువాత, నవల ముగిసిం తరువాత మనలో ఆలోచనలు ముసురుకొంటాయి.

ఈ సమాజం ఇలా ఉండాల్సిందేనా ?

ఈ సమాజాన్ని మనం మార్చలేమా ?

''తోడేళ్ళు నిండిన సమాజంలో తుపాకి అందుకోవడమే శరణ్యం'' అంటాడు ప్రేమ్‌చంద్ అసంపూర్ణంగా వదలిపోయిన ''మంగళసూత్రం'' నవలలో.

# కథలు

కథా రచనను దివినుండి భువికి దింపిన ఘనత ప్రేమ్‌చంద్‌ది. ప్రేమ్‌చంద్‌కు పూర్వం ఉర్దూ, హిందీ కథల్లో అద్భుతాలు, ఆవేశాలు, రాణివాసాలు, సాహసాలు ఉండేవి. మన కాశీమజిలీలు, శుకసప్తతి కథల్లాంటివే ఆ కథలన్నీ. సామాన్యుల జీవితాలు కూడా కథా వస్తువులు కాగలవని నిరూపించినవాడు ప్రేమ్‌చంద్. ప్రేమ్‌చంద్ కథలను చూచి పాఠకులు నివ్వెరపోయారు. నిత్యమూ తాము చూచే జీవితాలలో అంత అందం, అంత సౌందర్యం, అంత కళాసంపద ఉంటుందని వారు ఎరుగరు. ఆకాశంలో విహరిస్తూ ఉండిన కథను నేలమీదికి దింపాడు ప్రేమ్‌చంద్. అత్తరు పరిమళంకంటే మట్టివాసనలో మత్తు మరింత ఉందని నిరూపించాడు.

ప్రేమ్‌చంద్‌కు "నవలా చక్రవర్తి" అని పేరుంది. కాని వాస్తవంగా అతడు "కథాకథన చక్రవర్తి". అతని నవలలకంటే అతని కథల్లో ప్రేమ్‌చంద్ ప్రస్ఫుటంగా కనిపిస్తాడు. అతడు గొప్ప కథాశిల్పి. అందరూ చూచిన రాతినే తీసుకుంటాడు. దాన్ని ఒక సుందరమైన శిల్పంగా చెక్కుతాడు. చూసే వాడికి అంతకుముందు అది రాయి అనే భావం కూడా రానీయడు.

ప్రేమ్‌చంద్‌కు భారతదేశం అంటే ఎనలేని ప్రేమ - భక్తి, అభిమానం, భారతదేశానికి పల్లెలు ఆయువు పట్టులు. పల్లెలంటే ప్రేమ్‌చంద్ పడిచస్తాడు. పల్లెపట్టులను అతడు అనేక దృక్కోణాలనుండి పరిశీలించాడు. అక్షర చిత్రాలు రచించాడు అతని చిత్రాలు ప్రాణంలేని ప్రతిమలు కావు. గుండెల సవ్వడులు వినిపించే సజీవ చిత్రాలు.

ప్రేమ్‌చంద్‌కు పల్లెలంటే ఆవేశం వస్తుంది. పచ్చపచ్చని పొలాలు, నదీనదాలు, సెలయేళ్ళు, పచ్చని కొండలు, చెట్లు, గుడిసెలు, గుడిసెల మీద పాకిన సొరతీగలు, కాలి బాటలు, మోట బావులు, కండలు తిరిగిన రైతులు, సిగ్గులు వలకబోసే పల్లెపిల్లలు, పశువులనుకాసే బుడతలు, పల్లె ప్రజల అజ్ఞానం, అప్పులు, దోపిడీ, మూఢ నమ్మకాలు- వీటన్నింటినీ తన కథల్లో అతి సుందరంగా చెప్పాడు ప్రేమ్‌చంద్. వారి కథలు చదువుతుంటే మనం ఆ పరిసరా

ల్లోనే ఉన్నట్లు భ్రమింపచేయడం ప్రేమ్‌చంద్ శిల్పకళాచాతుర్యం. నాటి భారత దేశాన్ని అర్థం చేసుకోవాలంటే ప్రేమ్ కథలు చదువుతే చాలు. భారతదేశపు భౌతిక స్వరూపం మాత్రమే కాక భారతదేశపు ఆత్మ మనకు సాక్షాత్కరిస్తుంది. భౌతికంగా భారతదేశం మారవచ్చు, కాని దాని ఆత్మ-సంస్కృతి-మనను సర్వదా అలరిస్తుంటుంది అని చెప్పడానికి "మాతృభూమి" అని ఒక కథ రాశారు. అది చదువుతే బాహ్య సౌందర్యాన్ని, అంతః సౌందర్యాన్ని ఎలా విడదీసి దర్శించారో అర్థం అవుతుంది.

అతను మంచి వయసులో ఉన్నప్పుడు అమెరికా వెళ్ళాడు. వ్యాపారం చేశాడు. బాగా సంపాదించాడు. పెళ్ళి చేసుకున్నాడు. కొడుకులూ మనవలూ ఉన్నారు. అతనికి వార్థక్యం వచ్చింది. తన మాతృభూమిని చూడాలనుకున్నాడు. అంతేకాదు. ఈ మట్టిలో కలిసిపోవాలనుకున్నాడు. భారతదేశం వచ్చాడు. పూర్వపు భారతదేశం దర్శనం ఇస్తుందనుకున్నాడు. బొంబాయిలో ఓడ దిగాడు. ఇది నా దేశం కాదు అనుకున్నాడు. అందమయిన కొండల మధ్యనున్న తన ఊరికి చేరుకున్నాడు. ఊరు మారిపోయింది. తన ఇల్లు కూలిపోయింది. ఊళ్ళో ఆత్మీయత అంతరించింది. ఒక హోటలు వెలిసింది పాన్ దుకాణం, సారాయి కొట్టు, పోలీసుస్టేషను అవతరించాయి. తనకు ఇంత తిండిపెట్టేవాడు, పలకరించేవాడు, పడుకునేందుకు చోటిచ్చేవాడూ కనిపించలేదు. "ఇది నా దేశం కాదు" అనుకున్నాడు. ఊరుదాటి. కాలువ వద్దున రాతిమీద, చెట్టుక్రింద రాత్రి గడిపాడు తెల్లవారుజామున "ప్రభు! మేరే అవగుణ్ చిత్తనధరో" అనే పాట మెల్లగా పిల్లతెమ్మెరలా వినిపించింది. అతనిలో ఏవో పూర్వ స్మృతులు మేల్కొన్నాయి. అతనిలో ఏదో మానసికానందం వికసించింది, అలా పాడుకుంటూ ఒక గుంపు అటు వచ్చింది. అతనిలో ఉత్సాహం పురివిప్పింది. "అవును. ఇది నా దేశమే! ఇలాంటి శబ్దం మరోచోట ఉండడానికి వీల్లేదు. ఇది నా దేశం. ఇదే నా దేశం" అని ఆ గుంపువెంట వెళ్ళిపోతాడు.

భారత జాతీయ జీవితాన్ని చిత్రించడానికి ప్రేమ్‌చంద్ రెండు వందలకు పైగా కథలు రాశాడు. భారత స్వాతంత్ర్య సమరానికి ప్రజలను ఆయత్తం చేయడానికి వారు చాలా కథలు రాశారు వారి తొలి కథాసంకలనం "సోజెవతన్" ప్రభుత్వం వారి కోపాగ్నికి గురి అయిందంటే, అవి ఎంత ఉత్తేజకరములో అర్థం అవుతుంది.

"మనస్పర్థ" అనే కథలో జాతీయోద్యమ ప్రభావం చిత్రిస్తారు. భగత్, చౌదరి ఇద్దరు పాలివాళ్ళు. తరతరాలుగా వాళ్ళకు తగాదాలు వస్తున్నాయి. ఇరువురి ఆస్తుల్లో చాలభాగం కోర్టు ఖర్చులకు ఆహుతి అయిపోయింది. ఈలోగా జాతీయోద్యమం వచ్చింది. చౌదరి జాతీయోద్యమంలో చేరాడు. భగత్ అతని ఎదటిపక్షం అయిన ప్రభుత్వ పక్షంలో చేరాడు. ప్రజలు జాతీయోద్యమంవైపు ఆకర్షితులు అవుతున్నారు. చౌదరి నిర్మాణ కార్యక్రమాన్ని గురించి వివరిస్తున్నాడు. కోర్టులకు వెళ్ళొద్దు. ఖద్దరు వడకాలి. కట్టాలి. మద్యపానం మానాలి. చౌదరి ఉపన్యాసాలు వినడానికి దూరదూరం నుండి ప్రజలు వస్తున్నారు. భగత్‌కు చెప్పడానికి ఏమీలేదు. వినేవారు లేరు. అతను మనసు మార్చుకుంటాడు. చౌదరి ఉపన్యసిస్తున్న సభకు వెళ్ళాడు. వేదికమీదినుంచి తానూ నిర్మాణ కార్యక్రమాన్ని ఆమోదిస్తున్నానంటాడు. "చౌదరి భగత్‌ను కౌగిలించుకున్నాడు. ఆనందబాష్పాలు రాల్చాడు. మూడు తరాల వైరం క్షణంలో కరిగిపోయింది. వారిద్దరూ కలిసి స్వరాజ్య ఉపన్యాసాలు ఇస్తున్నారు" అంటాడు ప్రేమ్‌చంద్.

తులసీ రామాయణంలో "భరత్ మిలాప్" ఒక విశిష్టం అయిన ఘట్టం. అపార్థాలు దూరమయి అన్నదమ్ముల కలుసుకోవడం మనసులను కరిగించే దృశ్యం. ఆ ఘట్టాన్ని గుర్తుకు తెచ్చే కొన్ని కథలు రాశారు ప్రేమ్‌చంద్. అటు సాగిపోయేముందు జాతీయోద్యమానికి సంబంధించిన మరో కథ పరిశీలింతాం.

"సమర యాత్ర" ఊరికి వస్తూంది. ఊరికి సత్యాగ్రహుల బృందం వస్తూంది. కోదయీ ఆ ఊరి పెద్ద. ఏర్పాట్లు చేస్తున్నారు. అందరూ ఏదో ఒకటి సమర్పించుకుంటున్నారు. ఆ ఊళ్ళోనే ఉండిన ఒక ముదివగ్గు "నౌహరి." ఆమె దరిద్రురాలు. చేతికర్ర లేకుంటే కనీసం కదలలేనిది. కోదయీ ఆమెనూ చందా అడిగాడు. ఆమె తలకొట్టినంతపనయింది. ఏమీఇవ్వలేనందుకు కృంగిపోయింది. ఊరికి సత్యాగ్రహుల బృందం వచ్చింది. ఊరూ వాడా ఒకచోట కూడింది. నౌహరి కూడా కర్ర పట్టుకుని కదలివచ్చింది. వెనక ఎక్కడో నుంచుంది. నాయకుని ఉపన్యాసం విన్నది. ఆమెలో ఉత్సాహం ఉరకలు వేసింది కర్ర విసరిపారేసింది. గుంపులోకి దూసుకొనిపోయింది. పడుచువాళ్ళుసైతం ఆడలేనట్లు ఆడింది. ఎగిరింది. గంతులు వేసింది. పాటలు పాడింది. పడుచువాళ్ళు సహితం తలలు వంచుకునేటట్లు చేసింది. ఇంతలో పోలీసులు వచ్చారు. వాళ్ళను

చూచి అంతా జారుకున్నారు. నౌహరి పొలికేక పెట్టింది. పోలీసులను తిట్టింది. పోలీసులు ఆమె మీద విరుచుకుపడ్డారు. జనం ధైర్యంచేసి మళ్ళీ గుమిగూడ సాగారు. కోదయీ పోలీసులను అడ్డుకున్నాడు. ''ఇది భారతదేశం. ఆడదానిమీద చేయిచేసుకుంటే అంతుచూస్తాం'' అని పోలీసులను హెచ్చరించాడు. పోలీసులు కోదయీని అరెస్టుచేసి తీసికెళ్ళారు. మరో దళం తయారుకావాలంది నౌహరి. కసాయియుక్తంగా అంతా సత్యాగ్రహం చేయడానికి సిద్ధం అయినారు. నౌహరి కూడా వారివెంట సత్యాగ్రహం చేయడానికి కదలిపోయింది.

ప్రేమ్‌చంద్‌కు భారత వ్యవస్థమీద అపారం అయిన విశ్వాసం. ఉమ్మడి కుటుంబాల మీద ఎనలేని గౌరవం. అన్నదమ్ములను విడిపోనివ్వడు. ఏదో బంధంలో వారిని బంధిస్తాడు. నేడు శిథిలం అయిపోయిన వ్యవస్థ స్వరూపం మనకు ప్రేమ్‌చంద్ కథల్లో కనిపిస్తుంది.

''బడే ఘర్‌కీ బేటీ'' ప్రేమ్‌చంద్‌కు బాగా నచ్చిన కథ. ఈ కథలో ఉమ్మడి కుటుంబాన్నేకాక, గ్రామ జీవనాన్ని ఎంతో వాస్తవికంగానూ, కళాత్మకంగానూ చిత్రించాడు.

కంఠసింగ్, బిహారీసింగ్ అన్నదమ్ములు. కంఠసింగ్ బి.ఏ. చదువుకుని బస్తీలో ఉద్యోగం చేస్తున్నాడు. బిహారీసింగ్ మొరటు మనిషి. కంఠసింగ్ భార్య ఆనంది ఉన్నవారి ఇంటిపిల్ల. సంస్కారం గలది. కంఠసింగ్ వారానికి ఒకసారి ఇంటికి వస్తాడు. ఒకనాడు బిహారీసింగ్ పిట్టలు పట్టి తెచ్చాడు. వదినను వండిపెట్టమన్నాడు. ఉన్న నేయి కాస్తా పోసి ఆమె పిట్టల కూర వండేసింది. మరిది భోజనానికి కూర్చున్నాడు పప్పులోకి నేయిలేదు. లేదని చెప్పింది. కస్సుమన్నాడు మరిది. మొన్న తెచ్చిన నేయి అప్పుడే అయిపోయింది. మీ పుట్టింట్లో ఇలాగే ఖర్చు చేస్తారా అని అడిగాడు. ''పుట్టింటి మాట ఎత్తకు. ఈమాత్రం నేయి మా ఇంట్లో నౌకర్లు తింటారు'' అన్నది. మరిదికి కోపం వచ్చింది పాకోడు తీసి వదినమీద విసిరాడు. కంఠకు తాకాల్సింది. తప్పిపోయింది. వేలిపొట్ట పగిలింది. ఇంట్లో చిచ్చురగిలింది. కంఠసింగ్ వచ్చాడు. ఆనంది వివరించింది కంఠసింగ్ మండిపోయాడు. ''ఈ ఇంట్లో వాడయినా ఉండాలి, నేనైనా ఉండాలి'' అని వేరు కాపరానికి తయారయినాడు. బిహారీ సింగు తానే వెళ్ళిపోతానని మూట సర్దుకుని బయల్దేరాడు అప్పుడు ఆనంది రంగంలోకి వస్తుంది. భర్తను సమాధాన పరుస్తుంది. అన్నదమ్ములు కలసు

కుంటారు. కౌగిలించుకుంటారు. ఆనంది ఉన్నత సంస్కారం గలది. అందుకే ఆమె బడే ఘర్‌కీ బేటీ అయింది. మన వ్యవస్థలోనే ఆ ''గొప్పదనం'' ఉందనడం రచయిత ఉద్దేశం.

ఉమ్మడి కుటుంబాల్లో భద్రత ఉందంటాడు. అనూచానంగా వస్తున్న ఆ వ్యవస్థ భగ్నం అవుతుంటే విలవిల్లాడాడు ప్రేమ్‌చంద్. వారి తపనకు ''వేరింటి కాపురం'' చక్కని ఉదాహరణ.

భోలా మొదటి పెళ్ళాం కొడుకు రఘు. రెండో పెళ్ళాం పన్నా. పన్నాకు ముగ్గురు కొడుకులు. ఒక కూతురు. పన్నా రఘుకు సవతి తల్లి. రఘును అన్ని బాధలూ పెట్టింది. భోలా చనిపోయాడు. పన్నా తాను రఘును పెట్టిన బాధలు తలచుకుంది. రఘు పగ తీర్చుకుంటాడనుకుంది. అలా జరగలేదు. రఘు రేయింబవళ్ళు కష్టించాడు. తమ్ములను పెద్దవాళ్ళను చేశాడు. పన్నాను తల్లిలా చూసుకున్నాడు. పన్నా రఘును పెళ్ళి చేసుకొమ్మంది. కోడలు వస్తే కాపురం విడిపోతుందన్నాడు రఘు. పన్నా బలవంతంగా కోడల్ని తెచ్చింది. ములియా రాగానే కాపురం చూచింది. తన భర్త ఉన్నదంతా దోచి తమ్ములకు పెడ్తున్నాడనుకుంది. రఘుకు విషం పోసింది. వాళ్ళు విడిపోయారు. ఉన్న నేలచెక్క విడిపోయింది. రఘుకు సాయం చేసేవాళ్ళు లేరు. ములియాకు పిల్లలు కలిగారు. రఘు మంచం పట్టి కన్ను మూశాడు. ములియా వంటరిది అయింది. ఆమె జీవితం చీకటిమయం అయింది. కాపురం విడగొట్టినందుకు దుఃఖించింది. చంటి పిల్లతో పొలానికి వెళ్ళింది. బిడ్డను గడ్డిలో పడుకోపెట్టింది. పొలం పని చేసుకుంటూంది. పాప ఏడుస్తూంది. ఆదుకునే వారు లేరు. పన్నా పాప ఏడ్పు విన్నది. వచ్చి పాపను ఎత్తుకుంది. పన్నా పెద్ద కొడుకు కేదార్ వచ్చాడు. ''అన్న మా కోసం బలి అయినాడు. వదిన పని ఎందుకు చేయాలి? మాతోనే ఉంటుంది'' అని ఉమ్మడి కాపురం ఏర్పరిచాడు. కేదార్ ములియాను పెళ్ళాడాడు.

ముసలవ్వ కష్టాల్ని 'గురించి రాసిన చక్కని కథ ''బూఢే కాకే'' అవ్వకు భర్త పోయాడు. కనిపెంచిన సంతానం కాలగర్భంలో కలిసిపోయింది. వార్ధక్యం జవసత్వాలను పీల్చేసింది. ఉన్న ఆస్తిని బావకొడుకు బుద్ధిరాం పేర రాసింది. కొంపలో పడి ఉంది. ముసలిదాన్ని ఎవడూ లక్ష్యపెట్టడు. బుద్ధిరాం భార్య రూపకు గాని, ఆమె పిల్లలకు గాని ముసలిదంటే విసుగు. తిండి పెట్టరు.

ఆకలికి ఆమె ఏడుస్తుంది. ఏడుస్తే ఆమె మీద అరుస్తారు. ''లాడ్లీ'' రూప కూతురు పసిపిల్ల ఆమెకు మాత్రం అవ్వ అంటే అపేక్ష.

బుద్ధిరాం కొడుకును పెళ్ళికొడుకును చేస్తున్నారు. ఇల్లంతా సందడిగా ఉంది. గదిలో మూలన పడి ఉంది అవ్వ. ఆమెను అడిగిన వాడు లేడు. వంటల పరిమళాలు ముసలవ్వను ఉక్కిరి బిక్కిరి చేస్తున్నాయి. ఆకలి కరకర లాడుతూంది. సమయం దాటిపోతూంది. దేకు్కుంటూ గది నుంచి బయటికి వచ్చింది. రూప చూచింది. అరిచింది కేకలు వేసింది. ముసలవ్వ గదిలోకి వెళ్లి ముడుచుకుంది. భోజనం తెచ్చి పెడ్తారని ఎదిరి చూచింది. ఎవరూ తేలేదు. భోజనాలు అవుతున్న సవ్వడి వినిపించింది. అవ్వ మళ్ళీ దేకు్కుంటూ బయటికి వచ్చింది. బుద్ధిరాం ఆమెను చూచాడు మండిపోయాడు. లాక్కోపోయి గదిలో పడేశాడు. ఉత్సవం ముగిసింది. రాత్రి అయింది అంతా పడుకున్నారు. అవ్వకు అన్నం లేదు. ఆకలి మండుతూంది. కునుకురాదు, లాడ్లీ తనవంతు పూరీలు దాచిపెట్టింది, అవ్వకు పెట్టింది. అవి చాల లేదు. ఆకలి ఆరలేదు. లాడ్లీని పారేసిన విస్తరాకుల దగ్గరికి తీసికెళ్లమంది. అవ్వ పుల్లి స్తరాకుల్లోనివి రుచిగా హాయిగా తింటూంది. రూప లేచింది. చూచింది. అప్పుడు ఆమెకు కోపం రాలేదు. దుఃఖం వచ్చింది. పశ్చాత్తాపం కలిగింది. అవ్వకు విస్తరినిండా పదార్థాలు పెట్టి తినిపించింది.

ముసలితనాన్ని గురించి ఎంత చక్కగా రాయగలడో బాల్యాన్నిగురించి అంత అందంగా రాయగలడు ప్రేమ్‌చంద్. అతని బాల్యం సవతితల్లి కింద గడిచింది. అయినా అతడు ఎంతో అందంగా రాశాడు. అలాంటి కథలో ''ఈద్ గాహ్'' ఒకటి. పేదరికం పసిపిల్లల్లోని పిల్లతనాన్ని ఎలా చంపేస్తుందో చెప్పు తాడు. అంతేకాదు. పేదరికం పిల్లలను పసితనంలోనే ప్రాపంచికులను చేస్తుంది అంటాడు.

హామిద్ పసివాడు. తల్లి తండ్రీ లేనివాడు. అవ్వఅతన్ని పెంచుతూంది. ఈద్ వచ్చింది పాయసం వండడానికి పైకం లేదు పిల్లలు బస్తీలోని ఈద్ గాహ్‌కు వెళ్తున్నారు. అక్కడ సంత జరుగుతుంది హామిద్‌కు మూడు కానులు ఇచ్చి పంపించింది. హామిద్‌కు ముగ్గురు పిల్లలు జట్టు కలిశారు. ఆ ముగ్గురూ మిఠాయిలు కొన్నారు. హామిద్ కోరికను అణచుకున్నాడు. ముగ్గురూ

మూడు బొమ్మలు కొన్నారు. అవి ఎంతో బాగున్నాయి కొనాలనిపించింది. కొనలేదు. అతనికి అవ్వ గుర్తుకు వచ్చింది. రొట్టెలు చేసేప్పుడు చేయి కాల్చు కుంటూంది. అట్లకాడ కొనాలనుకున్నాడు. మూడు కానులకు- బేరంచేసి కొన్నాడు. పిల్లలు ఇంటికి వెళ్లిపోతున్నారు. తాము కొన్నవాటిని గురించి చర్చించుకుంటున్నాడు. అట్లకాడ అన్ని బొమ్మలనూ గెలువగలదు. విరక్కొట్ట గలదు అని నిరూపించాడు హామద్. అతనికీ లోలోన బొమ్మలమీదనే ఉంది. అన్నింటినీ చంపుకున్నాడు. అయినా అందరినీ వాదంలో గెలిచాడు. అవ్వ హామిద్ చేతిలోని అట్లకాడను చూచింది. తన విషయంలో మనవడికి ఉన్న శ్రద్ధకు పొంగిపోయింది. కావిలించుకుంది. కన్నీరు కార్చింది.

ఇతరులు తెచ్చిన బొమ్మలన్ని తెల్లవారికి విరిగిపోయాయి. హామిద్ అట్లకాడఅరగలేదు. కరగలేదు.నిటారుగా నిలిచిఉంది.''మరో విషయం.పసివాడు ఆరితేరిన పెద్దమనిషి అయినాడు. ముసలవ్వ అమీనా పసిపిల్ల అయిపోయింది.''

గ్రామీణ జీవితంలోని వ్యవస్థమీద అపార విశ్వాసంగల రచయితగా ప్రేమ్ రచించిన కథలకు పైకథలు మచ్చుతునకలు. అనంతరకాలంలో ప్రేమ్ చంద్ విశ్వాసాలు సడలి పోసాగాయి. సంస్కార వాదం విషయంలో అతనికి ఏవగింపు కలిగింది. మనిషిలోని మానవత ఎప్పుడో ఒకసారి మేల్కొంటుంది అనుకున్న అతని ఆశలు అడియాసలు అయినాయి. అప్పటినుంచి ప్రేమ్చంద్ ఆలోచనా విధానంలో మార్పువచ్చింది. తాను రాసింది తాను చూచిందికాదు, ఊహించింది అని గ్రహించాడు. భ్రమలోంచి బయటపడి వాస్తవ జీవిత చిత్రణకు పూనుకున్నారు. నవలల్లో ''గోదాన్'' వలె కథల్లో వాస్తవ చిత్రణ కథలు రాశాడు. వాటిలో ''నమక్ కా దారోగా'' ''కఫన్'' ''సవాసేర్ గెహూం'' లాంటివి ఎన్నో ఉన్నాయి.

మున్షీ వంశీధర్ ''నమక్ కా దారోగా'' ఉద్యోగం సంపాదించాడు. ''ఈశ్వరుడు ప్రసాదించిన ఉప్పుమీద ప్రభుత్వం ఆంక్ష విధించింది. ఇందు కోసం ఒక ప్రత్యేక శాఖను ఏర్పరచింది. దారోగా పదవికోసం వకీళ్ళుకూడా ఉరకసాగారు." అలాంటి ఉద్యోగం అది. జీతంకంటె పై ఆదాయం ఎక్కువ. వంశీధరుని తండ్రి బాగా సంపాదించమని నీతులు చెప్పారు. కాని ఆ నీతులు వంశీధరునికి వంటబట్టలేదు. అతడు నిజాయితీగల ఉద్యోగిగా పేరు సంపాదించు

కొన్నాడు. ఆరునెలల కాలంలోనే అతడు అగ్గిలాంటివాడనే వార్త గుప్పున పాకింది.

చలికాలం రాత్రి చలి ఎముకల కొరుకుతూంది. అంతా నిద్రలో ఉన్నారు. వంశీధరునికి యమున ప్రవాహపు సవ్వడితో బాటు బండ్ల చప్పుడు వినవచ్చింది. నిద్ర లేచాడు. తలుపు తెరిచి చూచాడు. బండ్ల బిడారు కని పించింది యమున మీద పడవల వంతెన తయారయింది. అవన్నీ ఉప్పు బండ్లేనని గ్రహించాడు. అక్కడికి చేరుకున్నాడు. విచారిస్తే అవి పండిత అలోప్‌దీన్ బండ్లని తెలిసింది. అలోప్‌దీన్ ఆ ప్రాంతానికి జమీందారు. లక్షలకు అధిపతి. సర్కారులో పలుకుబడి గలవాడు. బండ్లను పట్టేస్తానన్నాడు వంశీధర్. వాటిని కదలనివ్వలేదు.

అర్ధరాత్రి అలోప్‌దీన్ ఉరికివచ్చారు. వంశీధరుణ్ణి ప్రార్థించాడు. లంచం ఇవ్వచూపాడు. అయిదు వేలనుంచి మొదలయి ఇరవయి వేలదాకా వచ్చింది. "త్యాగానికి ధర్మానికీ-డబ్బుకూ అధర్మానికీ సమరం సాగింది. త్యాగంముందు డబ్బూ, ధర్మంముందు అధర్మం ఓడిపోయాయి. "బదలూసింగ్! ఈ మనిషిని కస్టడీలోకి తీసుకో" అని ఆజ్ఞాపించాడు వంశీధర్. అలోప్‌దీన్ చేతులకు బేడీలు పడ్డాయి విచారణకు న్యాయస్థానానికి తీసుకొని వచ్చారు. న్యాయస్థానంలో న్యాయానికి కళ్ళుపోయాయి. చెవులు మూతపడ్డాయి. "అలోప్‌దీన్ పెద్దమనిషి. ఇంతకొద్దిపాటిలాభానికి తలించి ఇలాంటిపనిచేయడు" అని వ్యాఖ్యం కొట్టేశాడు మేజిస్ట్రేటు. అలోప్‌దీన్ డబ్బు నీళ్ళలా ఖర్చయింది.

"వంశీధర్ ధనంతో యుద్ధం చేశాడు. అందుకుగాను అనుభవం తప్పదు. కష్టంగా వారం రోజులు గడిచాయి. ఉద్యోగం నుంచి తొలగించినట్లు కాగితం అందింది. వంశీధర్ వట్టిచేతులతో ఇంటికి చేరుకున్నాడు. తండ్రి వంటికాలిమీద ఎగిరాడు. తల్లి తీర్థయాత్రల ఫలితం సాంతం బూడిద పాలయినట్లు ఏడ్చింది.

వారం గడిచింది. ఒకనాటి సాయంకాలం అలోప్‌దీన్ సపరివారంగా వంశీధరుని ఇంటిముందు ప్రత్యక్షం అయినాడు.

"నేను నా డబ్బుతో అందరినీ దాసులను చేసుకున్నాను. మీరు నన్ను ఓడించారు. మీరు నా ఆస్తికి మేనేజరుగా ఉండండి. ఏడాదికి ఆరువేలు జీతం. నిత్య ఖర్చులు వేరు. దీని కాదనవద్దు" అని వంశీధరుణ్ణి వేడుకున్నాడు. వంశీ ధరుడు అంగీకరించాడు.

ఈ కథ ద్వారా నిజాయితీ ఎవరికి అవసరమో ఎరుకపరచారు ప్రేమ్ చంద్. సర్కారు ఉద్యోగంలో నిజాయితీకి గుర్తింపులేదు. ప్రైవేటు సంస్థల్లోనే నిజాయితీ రాణిస్తుంది. ఇది నిత్యసత్యం ఏనాటికైనా వర్తిస్తుంది. ఆలోచించండి.

''కఫన్'' భారతీయ కథా సాహిత్యంలోనే కాక ప్రపంచ సాహిత్యం లోనే ఉత్తమ కథ.

గేసూ - మాధవ్ ఇద్దరు తండ్రి కొడుకులు. ''వాళ్లు హరిజనులు. సోమరులు. ఒక్కరోజు పనిచేస్తారు. మూడు రోజులు ముడుచుకు పడుకుంటారు. ఊళ్ళో వారికి చాల మంచి పేరుంది. ఎవరూ పనికి పిలువరు. పిడికెడు గింజలు ఉంటే పని ముట్టరు. బలాదూరు తిరుగుడు వారి పని. పల్లెల్లో కష్టించేవారికి కావలసినంతపని. సోమరులకు పని ఎవడిస్తాడు?'' చేలల్లోంచి బంగాళా దుంపల్లాంటివి దొంగిలించి కాలం గడుపుతుంటారు. అప్పులు ఇస్తేచాలు, అందుకుంటారు. హరించేస్తారు. అప్పులు చెల్లించడం వారి ఇంటావంటా లేదు.

గేసూ పెళ్ళాం తొమ్మిది మందిని కని చచ్చిపోయింది. మిగిలింది మాధవుడు ఒక్కడే. వీళ్లు సోమరులు. దరిద్రులు. అయినా మాధవునికి పెళ్లి అయింది. ఆ పిల్ల వచ్చింది. వీళ్లు మరీ సోమరులు అయినారు. ఆమె కష్టించి వీళ్ల పొట్టలు నింపసాగింది. ఆమె కడుపుతో ఉంది. కనే సమయం. గుడిసెలో ఆమె పురిటి నొప్పులు పడుతూంది. గుడిసెబయట తండ్రి కొడుకులు చలిమంట కాచుకుంటున్నారు. దొంగిలించి తెచ్చిన ఆలుగడ్డలు కాల్చుకుని తింటున్నారు. కబుర్లు చెప్పుకుంటున్నారు. గేసూ తన వయసులో జమీందారు పెట్టిన పెళ్లి భోజనాన్ని గురించిన కబుర్లు చెపుతున్నాడు. మాధవుని భార్య బుధియా విలవిలలాడుతూంది. వీళ్లకు పట్టలేదు. ఆమె అరుపులకు నిద్రపట్టడంలేదు. విసుక్కుంటున్నారు. చలిమంటముందు ముడుచుకుని నిద్రపోయారు. బుధియా ఆక్రందన వారికి వినిపించనేలేదు. తెల్లవారింది. లేచి గుడిసెలోకి పోయిచూస్తే బుధియా చనిపోయింది. ఆమె శవం మీద ఈగలు ముసురుతున్నాయి నలుగురు చూడ్డానికి ఏడ్చారు. మొత్తుకున్నారు. ఇప్పుడు కావలసింది కఫన్- అంటే శవం మీద కప్పే కొత్తగుడ్డ. తండ్రి కొడుకులు జమీందారు దగ్గరికి వెళ్ళారు. జమీందారు విసుక్కున్నాడు. బతికి ఉన్నప్పుడు పెట్టడం కష్టం. చచ్చింతరవాత శవం మీద అందరికీ జాలి కలుగుతుంది. రెండు రూపాయాలు వాళ్లముఖాన కొట్టాడు. అతన్ని చూచి తలా బేడా,పావలా ఇచ్చారు. గేసూ దగ్గర అయిదు రూపాయలు

కూడాయి. అలా పోతుండగా కల్లుపాక కనిపించింది. ఇద్దరూ కల్లుపాకలో దూరారు. తాగారు. తిన్నారు. అలాంటి తాగుడు తిండీ వారికి ఈమధ్య దొరక లేదు. ఆవేశంలో గేసూ అన్నాడు:-

"అవును. అది స్వర్గానికేపోతుంది. ఉన్నన్నాళ్ళు ఎవరినీ కష్టపెట్టలేదు. చచ్చి మన జీవితాల కోర్కెలు తీర్చిపోయింది."

సోమరితనం, అప్పులు, తాగుడు మన జీవితపు మూలుగులను పీల్చేస్తు న్నాయి అని చెప్పడానికి ఈ కథ రాసినట్లున్నాడు ప్రేమ్‌చంద్. అంతేకాదు, తమ కష్టానికి ఫలితందక్కని సమాజంలో అంతా సోమరులే అవుతా రంటున్నా డేమో!

"సవాశేర్ గెహూం" లో కట్టుబానిసలు ఎలా తయారవుతారో వివరి స్తారు. ఇది పూర్తిగా నేలనంటిన కథ. "గోదాన్" నవలలాంటి బలమైన కథ. గోదాన్‌కు అవతారికలా కనిపిస్తుంది.

శంకర్ కుర్మీజాతివాడు; రైతు; కల్లాకపటం తెలియనివాడు; పేదవాడు. మోసం, వంచనలనుగురించి ఎరుగనివాడు. ఒకనాటి సాయంకాలం అతని ఇంటికి ఒక మహాత్ముడు వచ్చాడు. పీఠం వేశాడు. శంకర్ అతనికి ఆతిథ్యం ఇవ్వాలి. ఇంట్లో యవలపిండి ఉంది. అయితే మహాత్మునికి యవలపిండి ఎలా పెడతాడు? బ్రాహ్మణ దేవతదగ్గర సేరుంబావు గోధుమలు అప్పు తెచ్చాడు. మహాత్మునికి ఆతిథ్యం ఇచ్చి సాగనంపాడు. బ్రాహ్మణదేవతకు సేరుంబావు అప్పు చెల్లించడం ఏమిటని బాపడు పొలం దగ్గరికి వస్తే, ఏడున్నర సేర్ల గోధు మలు ఇచ్చాడు. ఋణవిముక్తుడను అయినాను అనుకున్నాడు. శంకర్ సంతోషిం చాడు. బాపడు పలకరించలేదు.

ఏడు సంవత్సరాలు గడిచాయి. బాపడు అవతారం మార్చాడు. సావు కారుకూడా అయినాడు. శంకర్ రైతుదశనుంచి కూలిదశకు మారాడు. ఒక నాడు బాపడు "నీ ఖాతాలో అయిదు మణుగుల ధాన్యం అమ్మగా రాసివుంది. ఎప్పుడు చెల్లిస్తావో" అన్నాడు. శంకర్ ప్రాణాలు పైపైనే పోయాయి. "అదేమిటి స్వామి! ఏడున్నర సేర్లు చెల్లిస్తినిగా" అన్నాడు శంకర్. "అది నీవు దానంగా ఇచ్చావు. దానం దానమే. అప్పు అప్పే. నా అప్పు చెల్లించకుంటే నరకానికి పోతావు" అన్నాడు బ్రాహ్మణదేవత. శంకర్ నరకానికి పోదలచలేదు. బజారుధర కట్టి అరవై రూపాయలకు కాగితం రాసిఇచ్చాడు. వడ్డీ నూటికిమూడు

రూపాయలు. సంవత్సరంలోపల చెల్లించకుంటే వడ్డీ మూడున్నర. సంవత్సరం పాటు కడుపుకట్టుకొని అరవై కూడబెట్టాడు శంకర్. అప్పటికి అప్పుడు డెబ్బై అయిదయింది. అరవై జమకట్టాడు. మళ్ళీ మూడేళ్ళు గడిచాయి. వడ్డీకి వడ్డీ పెరిగి అప్పు నూటఇరవై అయింది. బాపన్ సావుకారి అప్పు చెల్లించమని ప్రాణం మీద కూర్చున్నాడు.

''ఒక్క ఎద్దుంది. ఒక గుడిసె ఉంది. తీసేసుకోండి. అంతకంటే నాదగ్గరేమీలేదు.'' అన్నాడు శంకర్.

''ఏమీ లేకున్నా నువ్వున్నావుగా! వడ్డీకింద నాదగ్గర పనిచెయ్యి. వీలయినప్పుడు అసలు చెల్లింతువుగాని.''

''స్వామీ! వడ్డీకింద పనిచేస్తే పొట్టగడిచేదెట్లా?''

''నీ ఇల్లాలుంది, పిల్లలున్నారు. వారు కూలిచేస్తారు'' అన్నాడు సావుకారు.

శంకర్ ఇరవయి సంవత్సరాలు దాస్యంచేసి కన్నుమూశాడు. అయినా రుణం తీరలేదు. అతని తరువాత శంకర్ కొడుకు బానిస అయినాడు.

''ఇది నూటికి నూరుపాళ్ళు నిజమైన కథ. అటువంటి శంకరులు, అలాంటి బాపలు ప్రపంచంలో అనేకమంది ఉన్నారు'' అని కథ ముగిస్తాడు ప్రేమ్‌చంద్.

ఈ కథ మన సమాజంలో మూర్ఖత్వానికీ, మూఢ నమ్మకాలకూ ప్రాతినిధ్యం వహిస్తుంది. జీవిత వాస్తవాన్ని మనముందుంచి మనను ఆలోచించేట్లు చేస్తుంది. ఇలాంటివి ఇంకా మన దేశంలో అనేకం జరుగుతున్నాయి. అయితే, వాటిని గురించి రాసేందుకు ప్రేమ్‌చంద్‌లే లేరు.






# యువభారతి

## భారతీమిత్ర పథకం




ప్రతి సంవత్సరం రూ.10/- చందా చెల్లించి సాహితీమిత్రులుగా పరిగణించ బడే కంటే, ఒకేసారి "నూటపదహార్లు" అందించి శాశ్వత సభ్యులుగా చేరి యావజ్జీవితం యువభారతినుండి సదుపాయాల నందుకోగలరనే ఉద్దేశంతో రూపొందించబడినదే "భారతీమిత్ర" సభ్యత్వ పథకం.

## భారతీభూషణ పథకం




వదాన్యులయిన సాహితీబంధువులు తమ సహాయ సహకారాలను పెద్ద మొత్తంలో అందించి యువభారతి కార్యక్రమాలకు ఊపిరిని, ఉత్సాహాన్ని అందించి ప్రోత్సహించేందుకు యువభారతి "భారతీభూషణ" పథకాన్ని ప్రారంభించింది. భారతీభూషణులుగా చేరి యావజ్జీవితం యువభారతి అన్ని ప్రచురణా లను ఉచితంగా పొందండి.

యువభారతి భారతీమిత్రులుగా లేక భారతీభూషణులుగా చేరండి!

మీ స్నేహ హస్తాన్ని అందించండి.

**యువభారతి**
**సాహితీ సాంస్కృతిక సంస్థ**
**5 కింగ్స్‌వే, సికిందరాబాదు - 3**